ఉ॥ వేడికి దుగ్ధముల్, చలువవెల్లికి నాత్మలు పొంగు స్నిగ్ధముల్
పీడునుపీడు కూడి రవళించెను నేతకు స్వాగతమ్ము, క
న్గోడు ముదశ్రుశైలమున నొప్ప ముఖం బను తన్నెఁ గుందు లై
పోడిమిపావలన్ ద్యుతులుపోః సహజమ్ములు మంగళారతుల్ 80

శా॥ తా నా పశ్చిమఖండ మేగుట హాయల్ దర్శింపనో? కాదు, వి
ద్యాసై పుణ్యనిధానబోధనవిధానాభిజ్ఞ తాకాంక్షమైఁ
దా నాధానముచేసినవ్విధము లిం దౌ గోష్ఠులం బల్క నౌ
గానీ వచ్చియు నోటిదాక నవి పొంగన్ లేద వంగస్థితిన్. 81

క॥ ఇటు లై లజపతిరాయి ప్ర
కటించె శకటమ్మువెనుక కశ్వమ్మును పూం
చుటగా వై స్రాయిపనిని
ఘటించె జోహారు వంగఘనతకు సభలన్. 82

ద్వి॥ కరము ఘనమ్ముగా కల్కటాపురిని
జరిగెను సభ యొండు సరిగ నత్తఱిని. 83

మ॥ వినుపించెన్ స్తవనమ్ము కొల్వుతొలి ఋగ్వేదాంతసూక్తాంగిరో
మునిసమ్రాట్కృతవర్ణనామధురసంబున్ ద్రావి 'బంకిం' రచిం
చిన ఝుంకారము గేయరూపమున 'వందే మాతర'మ్మంచు జా
తినిజాతిన్ గదలించి నాడి యమృతోద్వేలర్ఝురీరూఢిగా. 84

గీ॥ వండువెన్నెలదుప్పటి నిండు కప్పు
కొన్న పున్నమ వడువునఁ గొలిలి గోష్ఠి
పులకరించె నిలువున గీతి పలుకరింప
నిదురిలిన యంతరాత్మను కదిపికదిపి. 85

సీ॥ చల్లనైనది కవోష్ణం బౌచు నుడుకెత్తి
నది మలయజసమానమ్ము నయ్యె
శాఖలు పోయిన స్థాణువులకును తత్
క్షణమ కెంజిగురాకు దందడించె,
బీళ్లను చౌళ్ల నెన్నెళ్లొ నాగటికఱ్ఱు
మోపకున్ననుఁ బైర్లు మొలకలెత్తె
గడ్డపాఱలు మ్రోగి కఠిన మైన తడి రాని
చట్టుబండలలోన జలము లూరె

తే॥ మూడుకాళ్ళ ముదుసలియుఁ, బేడి పిఱికి
యసి ధరించినయట్లు చే విసరి యార్చె
ఝు మ్మనంగ వందేమాతరమ్ముగీతి
మారుతమ్ము మోసుకపోయి మలయు మేరఁ 86

ఆ॥ కత్తినాలుకవానికి ఖండశర్క
రోపమోక్తియు, బ్రతుకెల్ల రుసరుస లగు
వాని కాణిముత్యపునవ్వు దాన మొసగె
రమ్యరీతి వందేమాతరమ్ముగీతి. 87

సీ॥ నీరు నిండారు కాసారమ్మునందు నె
ఱ్ఱని తమ్మి విరిసిన రాణ విరిసె
నాగస్వరస్వానభోగనాగర్య మో
కోడెత్రాచుపడగ వోలె నెఱసె
పరిణయోత్సవమందుఁ బారాణి పెట్టిన
చండికాచరణమ్ము చాయ మెఱసెఁ
కైలాసగిరితాండవాలోలచండీశ
కటకసజ్జము గజ్జ యటులు మొరసె

తే॥ ప్రజమనసులో నొకానొక భావము పర
తంత్రతాకంటకారణ్యదావ మిక వ
శాతరమ్ము శిర మెత్తిన నీ తరమ్ము
లె మ్మని చెవి వందేమాతరమ్ము మ్రోయ. 88

సీ॥ కిలకిల నవ్వి కేకిసలు భారతభాగ్య
లక్ష్మి కొట్టినది కే లంద మొలుకఁ
బసరు తీసెదను నీ బాహుకోటీషష్టి
ననుచుఁ దిట్టినది రాజ్యాంగలక్ష్మి
బాడబాంబుదము నీ పైని వర్షించును
త్వరపడకే యనె భారతాంబ
యిదిమొదల్ మెదలుడీ! యెవరి తెల్విని వారు
మాట లే లని విధి పోటుఁ దీర్చె

గీ॥ చదువుచదువున హృదయము సానదేర్చు
రవర బంకిముచంద్రచటర్జిగీతి
ధ్వనిత మగు వేళ, నెండిపోవు నొక జాతి
సస్యచరితన్ స్తనిత మైన స్వాదువేళ 89

క॥ అది యొక పంచాక్షరసం
పద 'వందేమాతరం' క్రమత్ స్వాతంత్ర్యం
బు,దళించెఁ గుచితభావముఁ
గదలించె జవమ్ము నొక్కొకడక న్నడకన్. 90

ద్వి॥ రచితము లజపతిరాయిచే లేఖ
యుచితము తొలిపరి, కున్న దం దిటులు. 91

ఉ॥ ఎందునొ విత్తనమ్ము మొలకెత్తును క్రొత్తగ నొక్కచోట ము
న్నందుగ, దేశ మెల్ల పొలముంగదవేః మఱునేట దానిదే
అందటిదిన్ స్వరాజ్యమున కా పృథుయత్నము, నేడు దీనికిన్
గందువగడ్డగా ప్రథమగణ్యము వంగము కీర్తిశృంగ మై. 92

ఉ॥ వందలువేలు నే పనికి వచ్చిన వచ్చును తెల్లకాగితాల్
మందులచే మషిన్ మసటు కానొకో! రావులురావు లేలువా
రిఁ దరఖాస్తు లై పలుకరింపగఁ, గాక, అవాఙ్ణవస్తుసం
బంధుల మెల్ల వారమును మార్మసలన్ వలె తెల్లవారికిన్. 93

ఉ॥ ముద్దులుగుల్కు పిల్లలకు మోదిలి కోరిక తీర్చుచుండరో
పెద్దలు, ముద్దు లేదు మురిపెమ్మును లేదు, ప్రభుత్వ మెత్తుకో
దద్దిర! ముద్దుముద్దుపలు కాడెడు నేతల కోరికన్, దెసల్
దద్దరిలంగ వంగజనులార! ధ్వనించి యెదుర్త మేల్బడిన్. 94

శా॥ భూగోళమ్మునఁ దోలుకన్నులకు దవ్వుల్ దోపనీ, యాత్మను
శ్రీగోళమ్మున వంగపంచనదముల్ చేర్వల్ గదో! కూతపె
ట్టై, గన్నుల్ తగ తైజసమ్ములును, చిత్తాహంకృతుల్ రెంటి కై
ల్లో గాఢమ్ముగ నట్లు మైత్రి తగ నాటోపింత మర్త్యాక్రియన్.

సీ॥ అమెరికాఖండమునఁ బెక్కు రనిరి భరత
ధరణి వంగసంఘట్టము నరచరిత్ర
లో సువర్ణాక్షరాధ్యాయభాస మనుచు
నేత్రములు నాకు సమ్మదక్షేత్రములుగ. 96

చ॥ లజపతిరాయిచీటి యిది లాజలు చల్లిన దక్షరమ్ములం
బ్రజపయి పాదలక్షపయి, పంక్తులు నూఱిట వ్రాయవచ్చు న
గ్రజ మగు భావముం బుధుడు వ్రాసెను దీపిల నిర్వదింట నం
చుఁ జదివెఁ గల్కటాసమితి సూరి బెనర్జి స్తవమ్ము కాగనే, 97

ద్వి॥ కిల్లా కిటులు గోష్ఠికిఁ జదువఁబడగ
నెల్లరి ముద కోటి కెత్తెను పడగ. 98

ఉ॥ ఎన్నిగ వంకరల్ తిరిగెనేని సరిన్ జొరు పుట్టలోనికిన్
పన్నగ మన్నటుల్ మెలికబాటలఁ వీడ్కొని రాజమార్గమం
దున్నది యస్మదీయ ముచితోగ్రము సంచలనమ్ము, సర్వతో
భ్యున్నత మాత!. భారతము పూర్ణమనోరథ మాత! దీనితో, 99

క॥ వంగముకడుపున నెప్పుడు
సింగములే పుట్టుఁగాని చీలులు కా, వీ
సంగతి పాలకతతి యెఱు
గన్ గడగుడు, పౌరుషమునఁ గానిది కలదే! 100

చ॥ ఉదుతయు రాము సేతువునకో యన నేనును వచ్చి సేతు నీ
పుడమిని రత్నగర్భతనముల్ బుజు వౌటకు మిమ్ముఁగూడి నా
వడిమెయి స్వల్పకాలమున, వంగవసుంధరఁ దొల్లి ( దారకల్
వడి యవి మీర లైన ప్రజలార! కడంక కిరీట మూనుతన్! 101

ద్వి॥ అని బరోడానుండి యరవిందఘోషు
పనిచిన యా లేఖ పఠితమ్ము సభకు. 102

ఆ॥ వె॥ పఠిత విపినచంద్రపాలు, విన్న జనము
ముప్పదైదువేలు, మోదశిశువు
హృదయశయ్యయందు నిటునటు దొరలాడఁ
గెరలి కొట్టినదియుఁ గేకిసలను 103

సీ॥ కాశినుండి గయనుండి ఝూన్సీసివార్ల
నుండియును కమ్మలు ప్రయాగనుండి వచ్చె
పత్రిక యగు బెంగాలీకి వంగకలన
భారతీయు లస్వప్నులైనా ర టంచు. 104

ఉ॥ లిఖితకగాఁ బ్రభుత్వభ్రువశిన్ గను ద్రావిడు లంపి రస్మది
యతీతిసారకారకమహోజనులార! స్వరాజ్యచిద్వనీ
వృతభవత్ప్రయత్నముల కేమను శాఖల మంచు లేఖ ల
ధ్యతుడు పర్వుచెర్వునెఅతామరరేకులుగా నుతిన్ గొనన్. 105

సీ॥ జనము మంచముపట్టగా ధనము నున్న
దాని నూడిచిపెట్టి యుత్సవము సేయు
నెవడు? కర్జను తక్క, వచించె సభలు
భేషనంగ లాల్ మోహనఘోషు తొల్లి. 106

క॥ ఆ లాల్ మోహను డేబది
వేల సభాస్తారులు నతివేలానంద
(శ్రీ) లెగఁజల్లగ నా లే
ఖాళి చదివి వినిచెఁ గంచుకంఠముతోడన్. 107

ఉ॥ దీక్షితు లైతి మేము భవదీయవిధానమునందు వంగహా
ర్యక్షములార! దిగ్విజయ మౌ మన పూనిక కంచు నుత్తరం
బక్షతదేశభక్తు లగు నాంధ్రుల నేతలు వ్రాసి పంపినా
రక్షర మక్షరమ్ము హృదయాభరణమ్మన మౌక్తికమ్ముగా. 108

శా॥ గంగాస్నాతరవీంద్రగీతవిలసద్గానామృతోపేతదీ
క్షాంగీభూతనిబద్ధకంకణులు నింకన్ వచ్చినారల్ ప్రజల్
తుంగం బయ్యె సదస్యసంఖ్య పదివేలుం బెచ్చు, నేనాటి గో
ష్ఠిన్ గై సేయద యంత, యా సభయుఁబొల్చెన్ వీటికిన్ వెల్పలన్

తే॥ చదువగా 'శ్యామసుందరచక్రవర్తి'
సంశ్రుతాంధ్రసంగతి సభసభయు నూగి
పోయి కనుబొమ లెగిరించె మాయురే! ప్రభు
త నెదుర తెనుగుమీరె నంతట నటంచు 110

తే॥ మంత్రపూతముగా హోమ మాచరింత
మాంగ్లదేశ్యాంశుకములతో ననియె నొకడు
మంత్రయుత మైన నందహో! మన సురలకు
వారు నవి కట్టరా దనె సూరి యొకడు 111

ఉ॥ వేని నొసంగ దగ్ని మన వేల్పులకున్ దినువానిఁ దక్క 'స్వా
హా'నినదాన వ్రేల్చినను నవ్యబుధుం డనె వహ్నియిష్ట మే
మేనియుఁ జేసికొని మన మీ నవచేలము లొప్పఁజెప్ప 'నా
హా'నినదానఁ దీరె నని యందఱి నిర్ణయ మయ్యెనయ్యెడన్.112

తే॥ పట్టణబహిర్జ్వలత్ బ్రిటన్‌పటపటలద
హనమహార్చి స్వగృహమంటుకొనిన యటులె
కల్కటాలోని ప్రత్యాంగ్లు డుల్కిపడెను
కాల దింతన మన కొంప కర్జ ననెను, 113

ఉ॥ ఒక్కెడ సాగుచుండె సభ యొక్కెడ యీ శిఖ రేగుచుండగా
నక్కడ కేగుదెంచె మును పన్గొనినట్లు కువిందబృందముల్
రొక్కములున్ గ్రహించెఁ బలురూపుల సేలలు సేయ మగ్గముల్
పెక్కువ సేయ కొల్విడగ, లేచెను మోహనఘోషు భాషియై

శా॥ ఛాయామాత్రులుగాఁ దలంచి భరతక్ష్మామండలీమర్త్యులన్
జేయంబూనె మనస్సు దొర్లిన యటుల్ చేతల్ ప్రభుత్వంబు తా
న్యాయాన్యాయవిచక్షణత్వరహితంబై, సాత్త్వ మీ వంగమున్
బాయల్ సేయుటె, యూరుకొందురె ప్రజల్ పాదద్వయిన్
సింహముల్! 115

గీ॥ మూఁడు వేళల ముచ్చోట మూఁడు సభలు
వత్సరమునుండి విభజన వద్దటంచు
నీ విదేశవస్త్రదహన మెన్నవదియొ
యిప్పటికి బుద్ధి రా దయ్యొ నేలుబడికి. 116

మ॥ అతివాదుల్ మితవాదు లందఱును నేడై కట్టుగా సర్వసం
తతి "పిన్‌టూ యెలిఫెంటు" నాంగ్లధరణీదత్తమ్ము నెద్దానినిన్
వ్యతిరేకింతము ముట్టుకోక యొక వల్వన్‌గూర్చియే యేల? భా
రతవస్తుక్రయదీక్షఁ బట్టి ప్రజలారా! గెల్పు లాస్మాకముల్. 117

క॥ ఈ పుంటన్ జనిపోయిన
రేపటికిన్ రెండు, వలదు బ్రిటిషౌషధముల్
చేపడనీ దానమ్ముగఁ
బాపపడగ బ్రిటిషునగ యపారార్ఘ్యంబున్. 118

ద్వి॥ కత్తుల వలయముల్ కార్యాలయములు
తొత్తులమై ప్రభుత్వోద్యోగ మంచుఁ
జొరబడినన్నాళ్లు పొరపడినాము
వెఱవదు, మన మాట వినదు నేలుబడి 119

క॥ చిలుకా! పలుకవె యనగాఁ
బలికినటులు నిదియుఁ దీని బాబున్ బలుకున్
గలికితనముతోఁ దెగఁద్రెం
పులు మన మొనరించుకొనిన మూఁడు సెకండ్లన్. 120

గీ॥ ఇంతటి మహోద్యమమ్మున కేమి కాము
ప్రజలె సంచాలకులు ప్రాచ్యవంగజనము
బహుజనము నడచిన చోటఁ బాట పడును
మెచ్చి చనని నేతకు ముండ్లు గ్రుచ్చుకొనును. 121

మ॥ అని 'లాల్మోహనఘోషు' పల్కిన దుపన్యాసంపు సారాంశ మై
జన మౌనౌ నని సందడించినది, ప్రస్తావించి శ్రీఘోషుధో
రణి మా ప్రక్కనె బాల యోర్తు ప్రిటను ద్రవ్యమ్ముగా మందురా
గనుపా మ్మన్నది తల్లి వేడినను, పల్కాడెన్ సురేంద్రుం డిటుల్

ఉ॥ పుట్టినరోజుపండు గని ముద్దుకొసంగెను తెచ్చి గ్లాసుగో
పట్టణమందుఁ గుట్టిన యుపానహాయుగ్మము మత్సఖుండు, తా
ర ట్టొనరించి నా మనుమరా అది ముట్టిన నొట్టు దానినిన్
బొట్టియ యేడు నేండ్లు మొనమొన్న నె నిండిన వంచు వాకొనెన్

క॥ ఔరా యన్నది ప్రజ, సొం
పారె ధ్వని తదుక్తిమురజ మరియును హాంసల్
సారించిన గఱు లటు వం
చారించిన యశము లొప్పు, సజ్జనులారా ! 124

ఉ॥ సజ్జనులార యన్నపుడు శౌర్యము లో టని యెంచరాద, అ
స్మజ్జవధాని పూనిక యమాసను వెన్నెలగా, జలంధరాల్
పెజ్జిననాడు నెండగ భళీ! యనిపించెఁ, బ్రభుత్వ మేసినన్
లొజ్జును గాదు తేజు, బదులుం బ్రహరింపము, సజ్జనత్వముల్. 125

ఆ॥వె॥ ఎంతఘోరమునకు నేల డి యొడిగ లె
దేశవిభజనమ్ము బాసల
సేయవచ్చుగాక చేయఁ నే? యేక
భాషమండలముల భా ములుగ. 126

శా॥ హైందవసంఘ మొక్కటియె హక్కులుగోరు ,వంగమందే యా
సందడి హెచ్చు, ముస్లిముల సంఖ్యయు నందు హెచ్చు, దీనితో
బొందు కుదుర్చుకొంచు నది పోరును, రాష్ట్ర రెండు చేసి దీ
నన్ దత మైన తున్కకు మనం బిడి దాని ... ర్త మద్యుతిన్.

మ॥ అని, పైవారును నీతలం పెటులో యట్లేగాక నాన్ దూగి క
ర్జను పై స్రాయి రహస్యయోజనములన్ సాగిం సాగించి చీ
ల్చెను వంగమ్మును రెండుగాఁ, దుఃఖలన్ జేప నా నంచు గు
ల్కెను, తేలున్ బ్రజలార! దీనికులుకున్ గిల్కున్ మాసమ్ములన్.

గీ॥ తూర్పుబెంగాలునందునఁ దుఃఖలందు
విజ్ఞులైన కొందఱు నేడు బిక్కుబిక్కు
మనుటయుఁ దెలియుచున్నది, మానవుండు
సంఘజీవి, మతము లేదు సౌహృదమున. 129

గీ॥ వంగ మను పంచఁ జేసి ద్విభాగము నొక
తడికఁ బెట్టు కర్జను ప్రౌఢతనము నెంచి
మురియు జన మెరియు నికఁ బ్రభుత్వమునకుఁ
బ్రజకు నడి గోడ గలె పై స్రాయి యనుచు. 130

క॥ చెఱపకుమా! చెడెద వనెడి
వరాల నీతి కపురాణపరిదృశ్యోదా
హరణము వంగముభంగి
కరణము, ప్రజయొరిమ చెఱగ కధికము మెఱసెన్ 131

శా॥ లూతాతంతు వకృత్య మీ పనిగ నాంగ్లోయిం యన్ పత్రికల్
నైతమ్మున్ బ్రకటించె, మమ్ముల జ్వాలజ్వాలా ం జేసికో
కో! తీరైన ప్రభుత్వమా! యనుచు నెన్నో ట్టి రర్జిల్ ప్రజల్
నేతల్, దానికిఁ జీమకుట్టినదియంతేన్ గాద ం తైననున్ 132

క॥ వ్రాతలు లేతలు, మ్రోతలు
చేతలు నిర్దిష్టకార్యజేతలు, లాలా
జీతిలకాదుల బోధ మి
దే తగు నని తోచె నాకు నీ యెల్లరకున్. 133

ఉ॥ హింసకుఁ బూనుకోక మనకెంత సమర్థత యున్న దంతయున్
మాంసల మౌచు నేలెడిసమాజపుటాటలు కట్టునట్టు లు
త్తంసితసిద్ధి యౌత! మన దారి, జరూ రని అండనందునున్
శంసనకారి యౌత! హితసంతతి యంతయుఁ దొంటిపోలికన్. 184

క॥ సింధీకిం బంజాబీ
కాంధునకున్ ద్రవిడునకు మహారాష్ట్రునకున్
సంధించు వంగ మంజలి
నంధకుఁ డో దైన యెల్లజాతికి నెపుడున్. 185

క॥ సరిపెట్టె బెనర్జీ యీ
వరుసఁ బలికి, బిపినచంద్రపాలుడు లేచెన్
వరలించె నుపన్యాసము
సరస్వతికిఁ దెలిసె తనదు శక్తియ దెంతో. 186

గీ॥ గుండె పగిలి వంగజనని కుములుచున్న
తరుణ మిది, స్వస్థనుఁబొనర్చుదాకఁ బ్రజకు
ప్రీడయే తక్క విలసించు క్రీడ లేదు
క్షణ మనగ లేదు, మధురభక్షణము లేదు 187

క॥ పౌరుషము మొలిచి యెదుగుట
కి రీతియ యాలవాల మింతేన్ క్షితిన్
గూరక దేశవిపత్తిని
కారణశపథమున నడుముకట్టుండు ప్రజల్! 188

గీ॥ నడుము నవరించుకొనుచు విన్న దపుడు సభ
వందనము చేసి మాతకు వంద కత్తు
లెదుర విలువుం డని, ధ్వనించె సభ యటుచెయి
రాయు వ్రేళ్ళ వందేమాతర మ్మటంచు 189

గీ॥ విప్పుకనుల లోతున నుండ నిప్పుగనులు
బిపినబా బుపన్యాసంబు వినిచె ప్రజకు
కదనకరణసమబలసంగ్రథితులార!
వీతప్రహారణరణవిశ్వవిదితులార! 140

క॥ పలుబడిబడులలోనికి
బాలురఁ బంపమియ గాక పంపెడువారిన్
గేలూని బతిమిలాడుచు
మీ లీలన్ జేయఁ జేయు మిమ్ముఁ బొగడెదన్. 141

మ॥ తగె జాతీయకలాలయమ్ములు భవత్సంతానసమ్మూర్తముల్
తెగెఁ బాశ్చాత్యవిభుత్వమున్ గొలువ నౌ నీచత్వముల్ వాణిన్
లగుడమ్ముల్ గొని కొట్టు రక్షకభటు ల్లజ్జింప కాలేజిమం
దెగమున్ఛాత్రుని త్రొక్క నీయని ప్రజా!నీశీలముల్ కీలముల్.142

ఉ॥ ము దుకొన్నదో! పయిని మూరిన యేల్బడివేటకుక్కకున్
బు చెప్పుచున్, బ్రిటనుపుట్టము లమ్మనువద్దయా! కొనన్
వ ని యార్చుచున్, వివణి బంకిముగీతము పాడ, వీడువీ
డ ర! యన్న నిన్ను పొగడ న్నుడుగుల్ బడుగుల్ గదే! ప్రజా!

శా॥ 'వందే మాతర' మన్న తల్లికి నమోవాకమ్ము లర్పించుటే!
యిం దెవ్వారికి హాని నిందయును లేదే! బాంబు వేయంగ నీ
క్రందే పి ల్వనవచ్చునా! యిది సెలన్ కర్ణమ్ములన్ గ్రుచ్చునా!
కందోయిన్ సెగ దెచ్చునా! ప్రభుతకే గణ్యమ్ము లీభావనల్.144

ఉ॥ కొందఱు మిత్రు లిందు నను కూడ దటన్నను చెప్పనెంచితిన్
పందలు పోలెఁ బ్రాణములు వాయరు వంగజనమ్ము లేటు శే
టున్ దగ నేయువా రొకపుడున్ 'బికెటింగు'నఁ నాత్మరక్తులై
కొందఱు మిత్రు లిందు నను కూడ దటన్ననుఁ చెప్ప నెంచితిన్.

చ॥ పొగలు ధరిత్రి లేక ఘనమున్ ఘనమండల మౌనె! యీ గతిన్
బొగులుట తెచ్చిపెట్టదొ ప్రభుత్వము వంగమువంగ మొక్కల
క్తిగ నొక యుక్తిగా నొరుల కెన్నడు లొంగ నటంచు గర్జితం
బెగయ ధ్వనించునే!యవుర!యిక్కము తెచ్చెను మేలుచొక్కమున్

శా॥ వందే మాతర మంచుఁ బత్రికయు నుద్భాసించు గీతంబె కా
దెం దున్ భారతమందు, భావబల మొండే భాషలే మెండు, నం
దందున్ గ్రంథము గేహ మేతదభిధా ద్రష్టవ్య, మేకమ్ము చే
సెన్ దేశమ్మును గేయ, మెంతు నకృశ శ్రీచంద్రుగా 'బంకిము'న్.

ఉ॥ వ్యక్తివిముక్తి కోచుఁ దనయంతటఁ దాఁ గనుపట్టు నాత్మయున్
వ్యక్తను నయ్యెఁ ద్రోవ తనయంతనె జాతివిముక్తి కీ ధరన్
సూక్తులు రెండె దేశ్యమఁ లనొప్పుట, యన్యము లొప్పకుండుటల్
సక్తను కాద యిందు గురుసంగతి, దేశమునొజ్జ దేశమే 148

మ॥ తను తా రక్షణచేసికొంట మనుజత్వం, బిద్ది దేవుండు నే
ర్పినదే, యట్లె స్వదేశపాలనము, వే ఠవ్వందునున్ దివినుం
డి ననుం బావగఁ జాల డంచుఁ బ్రజ! కంఠేకాలహూంకారగం
జనగర్జ న్నినదింపవే! ప్రభుతరంధ్రా లన్ని బంధింపవే! 149

క॥ ఒక భేరీధ్వన మగుచుం
బ్రకటింపంబడియె లోకమాన్యునిచేఁ బె
ద్దకొలువున నా్న జన్మా
ధికారము స్వరాజ్య మనుచు తిలకబుధునిచే. 150

గీ॥ బాలగంగాధరుండు శివాజి యొకటె
వాని మాఱుగ నిను మేలవనిని సత్క
రింతు మన్నట్టి ప్రజను వారించెఁ దిలకు
మరొక డైన చంకలుకొట్టి మరగకున్నె! 151

ఉ॥ నే నను శబ్ద మెప్పుడు ధ్వనించును గర్వమునన్? స్వదేశ్యసం
ధ్యానము లార్చి పైఁ గలిగి, యట్టిదె పింజలుపోసి దోవతిన్
జానుగఁ గట్టి హూణకృతశాపనధిక్కృతి చేసినప్పుడే
మానక నీతిబోద్ధ యయి మత్తుపదార్థము రోసినప్పుడే. 152

క॥ అని మరియు నొడివె బిపినుడు
కనపడినప్పుడె ధ్వనించు కరతాళమ్ముల్
భణితి విని చెప్పవలెనా!
ధ్వనించె కంఠములును తెగబడితి మ టంచున్ 153

ఆ॥ వె॥ ప్రజల యుత్సుకతకుఁ బట్ట పగ్గాలు లే
వతడు లేచె మాటలాడ నొకడు
పేర నశ్వినీకుమారదత్తుడు, పేరు
కన్న వాని తీరు క్రమతరము. 154

ఆ॥ వె॥ యువకులార! కడిమిగవకులారా! యెల్ల
పెద్దలార! పరువుముద్దలార!
ఝాన్సిలక్ష్మిసుగుణసారాగమముశాఖ
లార! యువతిరేఖలార! వినుడు! 155

శా॥ కొంపల్ తీసెడి నాలిముచ్చులు వలెన్ కొల్లాడెపో! భారతీ
యంపుంభాగ్యము నాంగ్లచేలములు, మీరయ్యా! కొనన్ రా దటం
చింపౌ వల్కులతోఁ బ్రచారముల సాగింపన్ దుకాణమ్ములన్
గుంపుల్ యోషలు వారలన్ జెనకునేః క్రూరాంగ్లరాట్దండముల్.

క॥ ఆ తరుణీపరి "వందే
మాతర" మను గీతి వినుచు మణిగమణిగ వ
స్త్రాశ్రితము మూయబడె, నొక
ఘాతకులున్ దక్క బ్రజ సుఖంపడెఁ జెవులన్. 157

శా॥ కంచున్ గొట్టినకొద్ది యద్ది నినదోగ్రం బౌను, పుల్ల మూ
యించన్ జాలరు నోరుఁ గిల్లరులు నై యీ యద్భుతుల ప్రజన్
ద్రెంచన్ వచ్చు శిరమ్ము. నయ్యదియు "వందేమాతర" ంచుఁ గా
వించున్ గానము రక్తధార లొడియన్ వీర్యస్ఫిరాధా న్ 158

క॥ ఎవరనుకొన్నదొ! యేలుబ
డి వంగజనము న్నిజాత్మ, డిల్లపడవలెన్
గవిసిన నిది, ము న్నెన్నడు
చవిచూడద తాను దీని చలమున్ బలమున్. 159

గీ॥ కార్తవీర్యార్జును కథ నీ కర్జునునకుఁ
జెప్ప నాతని సఖ్యుల కొప్ప దయ్యెఁ
జెప్ప దీ సభయును క్రియాశీల మగుచుఁ
జిటికె వేసి భవిష్యమే చెప్ప ననుచు. 160

ఉ॥ తంద్రియె కా దతండు పరదాస్యపు విద్య పఠింపఁజేయువా
డెంద్రియె, హీను డౌనుకదవే! యటులుంబరియింప సూనుడున్
గుంద్రని వాని మోము విషకుండము కోర్టున కెవ్వ డేగినన్
జంద్రలు మొల్వగావలె! విశాంపతికార్యగృహమ్ము లన్నిటన్ 161

మ॥ నను నిర్వాసితుఁ జేయనీ ఖయిదులోనంబెట్టనీ! కొట్టనీ!
తనువుం బ్రాణము కూడియున్నవఱకున్ దర్పించి యీ పాలన
మ్మును కట్టింతును కట్టుకంబమున కేన్నుం బోలె మీచేతనే
రణవత్కార్యనిమగ్నులార! ప్రజలారా! నిల్వుడీ! తోడుగా. 162

ద్వి॥ ఆ రీతి మాటాడె న య్యశ్వినీకు
మారదత్తు, సదస్సు మసరున నౌడు
గలచి వాహ్వా, యని కదలించి బుజము
శిరమెత్తి కన్నులఁ జిమ్మె తేజస్సు. 163

గీ॥ లోన ధీరుడు పైకి విలోలనయను
డై సురేంద్రుడు డెగాదిగ నరసె దత్తు
నితడు సభవైపె చూచె సింహాతఁణుండు
"బిపినఘోషు" 'లచ్ఛా' యన్న వీతఁ బలప. 164

గీ॥ సరగునన్ శ్యామసుందరచక్రవర్తి
లేచి సభఁ దేటిపారగఁ జూచి పలికె
సకలభారతమార్గదర్శకదృఢప్ర
తిజ్ఞులార! సభాస్తారవిజ్ఞులార! 165

ఉ॥ ధీరుడు నీ సురేంద్రుడు, సుధీవరముండు రవీంద్రనాథరా
కూరుకవీంద్రుడున్ గడమకోవిదు లెందఱో యింతచెల్వుగాఁ
దీరిన యెన్నికోల్వులఁ గథించిరో! చెప్పగలేము, లేదు మ
య్యేరున కీ ఘనుల్ పలుకు నింతటి హెచ్చినధాటి నేటికిన్. 166

క॥ మన మేగలిపై సారిం
చిన దేషాఖండ మీతు చేన్ దున్నుచుఁ దాఁ
దన నాగలిపై హలి వలెఁ
బనితం బీ స్థితియు వీరి వాక్ఫలితం బై 167

శా॥ అంతే కా దితరప్రపంచము ని దె ల్లానో యటంచున్ బలే
వింతన్‌బోలికఁ జూచుచున్నది, యథాభిప్రాయ మీ యుద్యమ
క్రాంతిన్ జాటుచునున్న దెల్లజన మాకర్ణింపగాఁ బత్రికా
సంతానంబు దినంబు నెన్నొ మహి భాషల్ వాని యన్నింటిలో.

మ॥ ఇది భంగం బొక వంగభూమి కనరా, దీచుట్టు సంద్రమ్ము స
మ్మదమో దుఃఖమొ భారతమ్మునకు సర్వాల్ తెల్పుకో నౌ పరీ
క్ష, దగన్ జీవయొ జావయో ప్రజసమైక్యం బైశ్వరం బౌ పరీ
క్ష, దృఢం బంగమొ తత్ప్రసంగమొ దిదృక్షాఘట్టమౌ నేటిదే.

మ॥ అటులైరేం డయినట్టి వంగ మొకటౌనందాక నే కాక యె
వ్వటికిన్ దేశ్యపువస్త్వలంకృతులె యొప్పన్ దేహమున్ గేహమున్
ఘటియింపంగదరే! నిసర్గవరమున్‌గా, విద్య జాతీయమై
వెటిలింపన్‌గదరే! ప్రభుత్వపు శిలాపీఠంబు నౌ చాకిరిన్. 170

చ॥ అపుడు బజారు దేశ్యములె యమ్మగఁ, దల్పులుమూయగాఁ బ్రభు
త్వపుబడి, కెందు నుండదుకదా! పికెటింగుక్రమంబు కార్యధా
మపునెదుటన్ వినా, యది సమర్థముగాఁ బచరింపవచ్చు, న
ట్లై ప్రతిఘటింపవచ్చు నవలీలగ నన్నియు శాసనమ్ములన్. 171

క॥ ఇది మీకుఁ జెప్పవలసిన
యది మీ నాయకులు, వార లగ్రగణులుగ మీ
రెద్ద లొడ్డి పోరవలసిన
యది, యొందఱ ఖైదు సేయు నాంగ్లవిభుతయున్? 172

గీ॥ అశ్వినీబాబుచెప్పినయట్లు ప్రభుత
మదకరిణి తానె కట్టుకంబమున వచ్చు
నింత యగుచు, శస్త్రము లేద యంతె కాని
ప్రబలయుద్ధము విజయ సమృద్ధ మిదియ. 173

గీ॥ ప్రభుత నావ, ప్రజాసముద్ర మురకున్న
వలకు నాడిన దాటయుఁ బాడినదియుఁ
బాటగాఁ జనుచుండుఁ, జెప్పవలెనేల?
దీని కల్లోలహతి నది దీనపడదె! 174

మ॥ అని యీ సృష్టిరహస్యమున్ వినిచినారా! బాలగంగాధరా
గ్రణి పోలెన్ భరతావనీసకలదిగ్భాగప్రజాపాళికిన్
ఘననేతల్ ప్రజలారః యప్పుడె పడెన్గా! యర్ధరాజ్యమ్ము చే
తను, తక్కర్ధము చేపడున్, సగము పత్రం బెట్లు చెల్లింపగున్? 175

శా॥ పష్యాయగ్నియు యూరపగ్నియని యున్నే భేదముల్? మొన్న నే
రష్యాపై విజయమ్ము గొన్నది జపాన్, క్రాంతిన్ మతిన్ గీర్తి పై
దుష్యంబందునఁ దీసిపోముకదా, శస్త్రాల్ కామె పో ర్వేలు, మా
నుష్యం బైన ప్రతిక్రియన్ విడి విపన్నుల్ మిన్న కేయుందురే! 176

ఉ॥ భారతమందునన్ మనది భాగ మటంచు, స్వరాజ్యనిష్ఠ మా
పోరున నిత్తటిన్ మనము పొందిన కీడును పాచికోగ నౌ
పోరును భాగమంచుఁ దలపోసి కడంగెద ముక్తరీతి బా
లారుణభాంగవంగజనమా! విజయమ్ము రయమ్ము రాకడన్. 177

క॥ అని శ్యామసుందరుం డన
జన ముత్సాహమును దెలుపు శబ్దము లెల్లన్.
వినియోగించికొనెన్, వా
క్కొని రా వరవడిని వాచకులు తక్కురునున్. 178

మ॥ తన రాజాలనపై తనుస్థితి సభాధ్యక్షుండుగా నెట్లొ వ
చ్చెను కుర్చీపయి మోయగాబడి దమశ్రీ మోసు 'నానందమో
హానబో' సంతమునన్ వచించెఁ బ్రజలారా! వింతు రెండేనుడుల్
తను పాలించెడివాడ నన్న నెవనిన్ ధర్మచ్యుతున్ మెత్తుమే : 179

మ॥ మృదువాగ్వైఖరినొక్కమారుతుదిగా 'మింటో'ను 'మార్లే'దొరన్
గదలింపగా దగు వంగ మేక మొనరింపన్, వారు కా దన్న నె
య్యది కాంగ్రె స్వచియించు కృత్య మది, దాహంబున్
జలం బోజఁ దోి
చుఁ దదీయం బగు తీర్పు ద్రోహము నటంచున్, పల్కెనల్లేమరిన్

క॥ జనములు వందేమాతర
మను నెలుగున లేచి కాళికాలయమున వ
చ్చి నుతించి దేవికడ కం
కణధృతిఁ బ్రతిన గొని రైకకంర్యముగ నిటుల్. 181

శా॥ మాతా! యాంగ్లధరిత్రివస్తువుల సంబంధమ్మునన్ బోము రెం
డౌ తున్కల్ మన వంగభూమి వొకటౌనందాక, నాంగ్లేయపీ
ఠీతామమ్మునఁ గామ, సర్వకృతముల్ దీర్పంగ నస్మజ్జనుల్
శ్వేతాస్యాభిసరత్వ మొందము, దను శ్రీ భంజనాగ్రేమతా! 182

ఆ॥ వె॥ అదియ వంగశపథ, మా సంజ మరియొక
పరమగోష్ఠి జరిగెఁ బురమునందు
సుప్రసిద్ధులెందఱో ప్రసంగించిరి
తొంటివారుఁ దొవరుకంటివారు. 183

ఆ॥ వె॥ ఆ సదమ్ము ముగియ నద్దమురే యయ్యెఁ
బొడిచెఁ జుక్క కొంతవడికి, నంత
మాత్రఁ దొలఁగునెట్లు? మడ్డిచీకటి, కాని
తూర్పు తెలివికొలదిఁ దొలఁగుచుండె 184

క॥ నిన్న సభ జరుగుచున్నపు
డున్నది పాశ్చాత్యముఖ మహో! చూడవలెన్
గ్రొన్నెత్రు చల్లుకొనినటు
ల న్నలువున్జూచి తూరు పప్పటి కాగెన్. 185

ఉ॥ ఇప్పుడు వారతిర్చెను ముడింగినపువ్వుల నెల్ల మెల్ల
విప్పుచు, వేనియందు విడి వెల్తియొ వాని విడిన్ దన చ్చున్
జప్పుడు కాళికాలయమునన్ ఘనఘంట నెసంగె, త లే
దెప్పుడు, లేదు నంత తడవేనియు నే నవరాత్రమం నన్. 186

క॥ సాయము పాశ్చాత్యరుచికి
సాయము, ప్రాచ్యపుఁబసకు పసందు ప్రభాతం
బే యని శీతము సేల్వన్
ద్రోయుచు ననెఁ బొరుగువానితో నొక బుధుడున్. 187

క॥ మొత్తము నెటులఁ గనినను
గ్రోత్తదనము దోప దందు, కోర్కొని చూప
యొత్తున నొకట నిలచి దరి
హత్తుకొనుచు నుండఁ దోచు నందలి మార్పుల్. 188

ఆ॥ వె॥ చుక్క పొడిచి కోడి 'కొక్కొరొకో' యన్న
యదనునుండి ధామనిధి పొడిచెడు
వఱకుఁ బ్రతిని మేషవర్ణన చేసిన
కలము గళము ధన్యకౌస్తుభములు. 189

సీ॥ పెద్దయుంబొద్దు నగ్ని కర్పించిన తన
తేజమున్ దీసికొని యుష్ణదీధితి యుద
యించెఁ దూర్పున నాశామహీజమందు
బండినొక పెద్దయాపిలుపం డనంగ 190

మ॥ ఉదయించెన్ దినరత్నబింబము తాంతోద్వేజితోద్వేలద
ర్పదురావారనినాదనిర్దళితదిక్ప్రక్రీవసారఘూ
ర్ణదుదన్వత్సమవంగభంగకృతిశీ త్నామనిర్యత్ప్రజా
హృదయార్చిఃప్రతిబింబ మై, స యపున్ గృత్యమ్ములారంభమై.

మ॥ ఉదితుం డర్యము డయ్యెఁ బ్రాక్శిఖరిపై నుచ్ఛృంఖలాచారపా
రదధారాతితరాంపరిసారబలసారాభీలనిస్త్రింశసం
పదుదారక్రకచావతారకరవన్మందేహదేహచ్ఛిదా
స్పదనీతాసృసహస్రధారుణకృతోపాంతాఖిలాస్థాను డై. 192

క॥ ప్రాచీమాతకు 'వందే'
వాచనమ్ముం బలికి రథముపైని క్రమవ్యా
కోచమ్ములుగాఁ దీక్షత
లొచు వెడలెఁ దరణి పశ్చిమాభిముఖుం డై. 193

ఆ॥ వె॥ తోయజాప్తు బండి తూరుపుపల్లమ్మ
నుండి మిట్టు కెక్కె నుద్ధతముగ
కూర్చొనిన నియంత కుంటివా డని మన
కెట్లు తెలియు? రథి వచింపకున్న 194

ఉ॥ ఓయి! యనూరుడా! చనగ నున్నది చాల యెడారి, సుంత జా
గై యరుదెంచినా మరదమందున, నిప్పటికేని మించియుం
బోయిన దేది లే, దయిననున్ ఝుళిపింపర! నీ కశన్ ఫెడేల్
[మోయ, హాయాల్ రయాల్ గలుగ పొందికమై,
రవి పల్కె నీ మెయిన్. 195

ఉ॥ ఓయి! సింహాస్యుడా! యసి మహో[గనిశాతమె నీది, యైననున్
గోయగలేదు దైవ మొనగూర్చిన నేటి [ప్రజాసమైక్యదా
ర్ఢ్యాయతబంధమున్, మదసి రాక్షసి కోయు నటంచు నిన్ను నీ
వే యనుకోవలెన్ [భ్రమసి, పెన్‌రవళిన్ గవి పల్కె నీ మెయిన్. 196

మ॥ ఇది గేయమ్ముగ నా రవీం[ద్రకవితో నేతెంచు వేలున్ జన
మ్ము దురావారము తార మంట మొరసెన్, మొన్నంబలెన్ నిన్నయ
ట్లు దుకాణమ్ములు పట్న మంతటను నేడున్ మూయవాలాయ, ఖి
య్యాది సుగ్రీవులయాజ్ఞ యంచుఁ[బతివీధ్యాఘోషణల్ హెచ్చెలెన్.

గీ॥ కొల్వున రవీం[ద్రనాథరాగో రుపన్య
సించుమున్ను త[ద్రచితమ్ము [ప్రాంచితమ్ము
బాలికాగణో గ్గీతమ్ము పాట యిటులు
విశ్వమునకుఁ జూపినయది వెలుగుబాట 198

గేయం॥ మేలుకొలుపుము నా దేశమును, మేలుకొల్పుము నా తండ్రి!
ఎచట మనిసి తలయెత్తి తిరుగునో,
యెచట మనసు భయ మెఱుగదో!
యెచట తెలివి స్వచ్ఛందమో,
ఆ స్వేచ్ఛాస్వర్గమ్ములోనికి ॥మేలు॥
జగము విభాగము కాదో యెచటన్ స్వార్థపుగోడల గదులతో
సత్యగర్భముననుండి యెచట వాక్సమవాయ మవతరించునో
అచటికి స్వామీ! అచటికి,
ఆ స్వేచ్ఛాస్వర్గ మ్ములోనికి ॥మేలు॥

యతనము పరిపూర్ణత కభిముఖ మై
అలయక బాహువు లెచటఁ జాచునో
ప్రాతనడువడి యెడారియిసుకబడి హేతుఝరి యెచటనినుకదో
అచటికి స్వామీ! అచటికి,
ఆ స్వేచ్ఛాస్వర్గమ్ములోనికి ॥మేలు॥
విశాలభావాచరణాభ్యుదయనవీనసుపథమున హృదయమున్
ఎచట నీవు నడపింతువో! అచటికి స్వామీ! అచటికి,
ఆ స్వేచ్ఛాస్వర్గమ్ములోనికి ॥మే॥ 199

మ॥ సభలో ప్రార్థన యై రవీంద్రుడు ప్రజాచైతన్యమున్ స్వోక్తిసా
రభరణ్యామ్మొనరించె నెంతో, జనులారా! వంగభూమీభిదా
రభసక్రోధనులార! జాతి యొరిమన్ భ్రాజిల్లి గ్రొచ్చుఁ దథా
ప్రభుతాగమ్మును మూతిదంతగరిమన్ ప్రచ్చున్ యథా పూగమున్.

గీ॥ పల్లెజనము పట్టణజన మెల్లఁ గలిసి
జాతి, సత్య మహింసయు సంఘటించి
నీతి, బహువిధశౌర్యమ్ము జాతి, యక్ర
మమ్ము నెదిరి నిల్చుటయును సుమ్ము! నీతి. 201

క॥ చె కుఁ గొమ్మలు పోలికఁ
బ దలయు గుబురుగొనగ బహుశ్రేయములన్
న కొనవలయుఁ బల్లియ
ప ల జాతీయములుగఁ బ్రబలోత్సవముల్. 202

చ॥ ఋతుఋతు వొక్క వేడుక ఘటించితి బాలురఁ బెక్కువిద్యలన్
జతురులఁ జేయు నాదు బడి శాంతినికేతనమందుఁ రంగునీ
రు తెలఅగునన్ ముదమ్ము నొకరొక్కరిపై గుమిగూడి చల్లుకోన్
మతులు స్వతంత్రభావనల మల్లియపందిరు లౌచు నల్లుకోన్. 203

చ॥ పడియను నీరు పుస్తకపుపారము, గంగజలమ్ము లోక మి
చ్చెడు చదు వంచునున్ సభలు చెప్పెడి వంచును సంబరాలు చే
సెడివి న టంచునున్ దెలిసి చిన్నవి పెద్దవి యైన మేళలం
దుడుగక పాల్గొనన్ వలయు నూళులఁ బౌరులు కల్పుగోలుగా

ఆ॥ వె॥ పౌరులార! యిటులు పల్లీయులును మీరు
కూడబలుకుకొనగఁ గొసరు బలము
వంగమునకె కాదు సాంగభారతజగ
త్ప్రదీప మగును, దిగును ప్రభుత. 205

ఉ॥ ఎంత నినాదముల్ సలుప నే మగు! వీధుల రాజధానిలోఁ
గొంతగ సీమమిల్లులకుఁ గూర్చిన నష్టముతోడ నే మగున్,
బంతులు దీర్చి ఛాత్రులును మామకసన్నిభపారశాలలన్
గాంతిలసేయ నే మగును: తగ్గదు వీనఁ బ్రభుత్వ మంతగా. 206

గీ॥ తాను తనపైని జాతి యాధారపడవ
లయుఁ బరిశ్రమముల నెన్నొ నెలకొలిపియు
లోని పౌరుష మను దీవె పైని పెట్టి
యొందు వీథివీథిని వెలిగింపవలయు, 207

మ॥ నిర్మాణాత్మక ముద్యమమ్మున వెత న్నిర్జింతు, మా త్రోవనే
యురుమ్మల్ మెర్మ్మలు నెన్నియేని, పెడ యానో! త్రోవ హాగ్లీనదిన్
గూర్మమ్ముల్ మనవిజ్ఞతల్, ప్రభుత వౌకువ్వాదముల్ పెక్కునేం
డ్లర్మున్, సాగదు సాంఘికప్రగతి, ధ్యేయమ్ముల్ మహాలస్యముల్

గీ॥ సంఘచైతన్యమున మార్పు సంఘటిల్లి
విప్లవమున బ్రహ్మాస్త్రము విజిత మగును
ఆయుధికమె శౌర్యం బని యనుట తప్పు
శ్రీ యనగఁ బైడియే యని చెప్పినట్లు. 209

ఉ॥ న్యాయము, నాత్మగౌరవము, నా సహజన్మమె యంద అన్నయా
ప్యాయత, కాళిమాత యన నౌను మదీయము శక్తి, నాకు నే
నే యగుదున్ సమస్త మను నిర్భరచేతము, శౌర్యలక్షణా
లీయవి, జాతి దించును మహేంద్రుని పీఠమునుండి వీనితో. 210

గీ॥ తూర్పుబెంగాలునకుఁ బోయి తుటుములుతుటు
ములుగ గ్రామోద్ధరణకార్యముల సహాయ
పడుడు ముస్లిముసోదరవర్గమునకు
హిందువులు! వారుఁ బ్రభుతకు నెదురుతిరుగ, 211

సీ॥ సల్పిన దమూల్యసేవ నిస్లాము భరత
ఖండమునకు శిల్పమునందు గానమందు
చిత్రకళయందు సాహితీక్షేత్రమందు
రంగుబల్బుల బిజిలీ తెలుంగు గాగ 212

క॥ కాడియు మేడియు నొక్కపై
బాడవనున్ దున్ని పంట పండించినట్లున్
కూడుచు హైందవ మిస్లాం
వాడిజతన చేసి పొందు స్వాతంత్ర్యంబున్. 213

ఉ॥ పూసిన రంగుతో నెఱియ పూడునె గోడకు? దానిపూడ్పయే
వేసిన రంగు భాసిలును, భేదచయమ్మును బాసి యొండొరుల్
చేసిన మైత్రి వాసిలును చిత్రిగ, సంస్కృతి భిన్నమైన నే
మీ! సమమానవత్వముతె యెందును నేని తెగల్ ధరిత్రిపై 214

క॥ భారతజనబలరాశికి
నీరాజన మిత్తు హృదయనిభృతజ్యోతీ
తారాజనముగ, దేశో
ద్ధారక మగు దీని నమ్మెదన్ ద్రికశుద్ధిన్. 215

సీ॥ ఆర్థికముగను రాజకీయముగ సాంస్కృ
తికముగన్ బ్రజ యొక చోచుఁ దేజరిలుట
వేరె త్రికరణశుద్ధి, యీ తీరు నొద్ది
క గల యుద్దియు చేతనే కార్యసిద్ధి. 216

సీ॥ దయదయ యటంచు హృదయము తారసిల్లి
దీనజనము నాదుకొనుట దేశభక్తి
జయ! జయ యటంచు గుంపులో జంత్రము బలె
నాదుకొనుట భారతి గుండె బాదుకొనుట. 217

సీ॥ పాదకటకఝుళంఝుళధ్వనితభార
తేందిరయ, వాచాలమందిరయుఁ గాదు
ప్రజను దేర్పగ, కావ్యజీవమ్ము మధిర
సమ్ము కాదు మనీషిరసమ్ము కాని. 218

గీ॥ గోత్ర మున్నదియే కాని కులము లేదు
పాత్రము మనస్సు సతము సౌభ్రాత్రమునకు
నా మతం బన్ని మతముల నామతించు
నని తలచువారికి జయమ్ము హస్తగతము 219

చ॥ ధనము ఋణ మ్మొసంగెడి విధమ్మునఁ గాక సుఖమ్ము కష్టమున్
జనములు పంచుకోవలయు, సాహు లిడన్ దగుఁ గాని యప్పు వ
డ్డిని ధనరూపమందున గడింపక యాదరణమ్ము రూప మై
కొనవలె, నిట్లు నై గెలుచుకొన్నది పో౹ భువి యెన్నడో దివిన్.

గీ॥ తన క గౌరవకరముగాఁ దలచినపుడు
భారతం బెదురించును ప్రభుత నని వ
చించె రామమోహనరాయ లెపుడొ మాకు
కీనగురువు, నేటికిఁ దులకించె దినము. 221

గీ॥ పాటు రా నిది యిది యని స్పర్శఁ దెలిసి
గ్రుడ్డి బలె దాని తప్పించుకొనుటె కాదు
కనుదెఱచి పెఱరాచరికంపుబెడద
వేరుతోఁ బెల్లగించు తెల్వి మనవలయు. 222

క॥ యూరపులో జాతీయత
వేలు శరీరాత్మకముగ భేదము లే దై
పాటింప డొక్క డొక్కని
కై రక్తము భృతుడు తక్క నతిఖిద లిం దై. 223

మ॥ స్వజనం బాడిన మాట రాచరికపుంజట్టన్ముకన్నన్ గరం
బు జగా యంచుఁ దలంచి, యొండురులపైఁబోరాని విశ్వాస మై
ప్రజ దాస్యమ్మును పాచుఁ,గాని యిటనే వచ్చెన్ దగా,యంతలో
గజమంతల్ త్రుటిఁబిచ్చికంత లగుచున్ గారాని యావేశముల్.

శా॥ ఆవేశం బొక వహ్ని, భావముల నాహరించి భస్మీకృతిన్
గావింపన్ సృజనాత్మక ప్రతిభ దక్కన్ జాలునే! పండితుం
డో, వానోపిక, వాని కల్పితనమున్, దూరేతుతో దెల్పి, త
త్రావిద్రశాంతకృతుల్, కడింది యుపయుక్తంబుం బొనర్పున్
సెగన్. 225

ద్వి॥ ఆవేశ మను గట్టు మధిరోహణీయ
మే వేళ ? కళ్యము హేతు వా వేళ. 226

క॥ ఆవేశము సంఘ్రశే
యోవిధిమై మలచుకొనగ నొప్పిన తెలివిన్
జేవను పెంచుకొనమ, యూ
రా! వింతలు నింత లౌనె! యాలస్యంబుల్. 227

క॥ రేకులు పూవులలో వలె
నాకులలో సినెలు వలె, నలరవలె సమా
జాకుంరితశుభగుణములు
ప్రాకవలె దిగంతములకు భారతయశముల్ 228

ఉ॥ ఛాయలు చెట్లపిన్ మొగిలుచాయలు పారముఁ జెప్ప నాదు వి
ద్యాయతనమ్మే వేఱు, ప్రభుతాచ్ఛిదుపాయమె కాక జీవనో
పాయము వృత్తినేర్పవలె వల్లె! యనంగనె కాదు బళ్ళు జా
తీయము లాంగ్లపారవసతిఁ విడి వచ్చిన ఛాత్రపాళికిన్. 229

క॥ అంతగఁ జేసి నినాదము
నింతగఁ బలికెద వటందు రేమొ, ప్రభుతకై
యంతియ యెప్పుడు, ప్రజకై
యింతియ, మనలోనిమాట లిట్లే వలయున్ 230

క॥ కరువలి మృదువై కదలెడు
సరసీజవనమ్ము వోని సదమున జన మా
కరమై యామోదమునకు
వఱలెన్ సభతుది రవీంద్రభారతి మరియున్ 231

గీ॥ భారతము తనయంతఁదా వలయు నాథు
నికము గాగ నన్నింటఁ, బూర్ణిమసితాంశు
బింబమటు వెలుఁగవలయు, విజ్ఞ మయ్యు
సాయపడద యెందునను పాశ్చాత్యజగతి. 282

ఉ॥ వచ్చెనుగాక! దైవవిధి వారడి నైయె యది పాలకమ్ముగా
బిచ్చము పెట్టవే! యనుచు వేడదు ప్రాచి ప్రతీచి నెందునున్
గచ్చర మెంతయో కరడుగట్టిన స్వార్థము, దాని కగ్గమై
యిచ్చున దేది? కైకొనున దేది? యగౌరవ మొండు తక్కఁగన్.

శా॥ "సీలీ" చెప్పెను దీని, "మిల్లు" ప్రవచించెన్ దీని నంచున్ వృథా
కాలక్షేపము పాశ్చాత్యపుస్తపఠనన్ గావింపనేలా? బల
శ్రీలారా! ప్రజలార! భారతధరిత్రీగ్రంథ మధ్యాక్షమై
గాంలన్, దీని పఠింపరేల? యెడదన్ బాటింపరేలా? సెగన్ 284

మ॥ ఇరు వర్గమ్ములు పార్లమెంటున, నెదేని గెల్చినన్ వాదనన్
కరముల్ రెండవి లండనందుఁ బ్రజవై కాంచెన్ జయం బయ్యదే
భరతత్మాపప్రభుగోష్ఠిలోనఁ బ్రభుతాపక్షమ్ము తోడేలు, సొం
పటి వోటింగున హక్కులేనిది ప్రజాపక్షమ్ము కుందేలునున్ 285

చ॥ అనుపమవాగ్మి నాంగ్లమునఁ, బ్రాంచితతర్కము తెల్పి నాది యం
చు నెవడు హక్కు వేడినను చొచ్చలుకొట్టును, రాజ్యయంత్రమం
దున వదు లైన భాగమునఁ దోడుత సీల బిగించి కొట్టు, నాం
గ్లుని విధ మట్టిదై జయము గొందుమయా! చెయి చావ
మెత్తమున్. 286

చ॥ ఇటు లయి వేడు నుద్యమము నింకను వెన్నను తీయఁ బాలు చి
లుక్కలె యని యంచు మీర లనుకొందురొ! పా లెట నుండె! మీవి చి
లుక్కట లెట నుండె! చిలుక్కటలు లోగిట నుండగఁ గేంద్రమందునన్
ఘటముల నుండెఁ బాలు, కొలగాని ప్రయత్నము లీసడింపుడీ!

క॥ యోజించి దిటవుమై సా
మాజికముగ స్వార్థరహితమతిఁ గవియుడి । య
ట్టి జువ్వియాకెకాదా !
రాజసభకుఁ, గామికా విరాగకథనముల్ ! 288

క॥ ఒకచోట రవీంద్రు డిటుఁ బ
లుక వారీంద్రుడు గురిసెఁ బలుకుజడి నటు వే
ఱొకచోట బెల్ల మిడవె చె
ఱకా! యనగ నిడునె! యల్లె ప్రభుత య టంచున్. 289

# ఉద్యమ ఖండము

శా॥ వారీంద్రుండు యుగాంతరాఖ్య మొక దివ్యత్పత్త్రికం బెట్టె నిం
తేరా! యిప్పటి కర్త మంచును తనున్ దీవించి పంపంగ వి
ద్యారణ్యాం డరవిందఘోషు కలకత్తావాసమున్ గోరి, తై
దాలున్ వ్యాసములం బరించి యువకుల్ తారస్థితిన్ మెచ్చగా 1

గీ॥ ఒకడు శ్రీవివేకానందునకు ననుజుడు,
శోధితము వ్రాత్తు 'భూపేంద్రనాథదత్తు'
నొకడు 'దేవవ్రత' రచించు నుగ్రత, నల
పత్రికకు వీరు కలరు సంపాదకులుగ. 2

ఉ॥ అక్షరమక్షరంబు భరతాంబపదంబున బంధుజీవకం
బై క్షుధ గొన్న సింహమున కౌ కనుపాపకుఁ జిత్రలేఖనం
బై క్షమయం దనాదరము నాహవమందు సమాదరంబు వం
గక్షితి ప్రోధిచిత్రిక యుగాంతర పత్రిక పెంచె నెల్లెడన్. 3

క॥ అరవిందుని వ్యాసపరం
పర స్వాతంత్ర్యంబు ప్రాణ మై యుపనిషదం
గరుచి నెసగుఁ బత్రిక, యం
దురుతర మాకాశరామనోత్తరచయమున్. 4

గీ॥ పర్యవేక్షకు డవినాశభట్టసూరి
యేబదియువేలు ప్రతుల నమ్మించుచుండె
దీనిముం దెన్నొ వారపత్రికలు దుర్మ
హార్తమున మొదలిడినవేమొ! యనిపించె. 5

క॥ 'మానిక్తోలా'లో స్వ
స్థానము నిష్ఠుటముతోడఁ దగఁ బత్రిక కా
స్థానికి నాయుధగుప్తికి
దానిని వారీంద్రు డూనెఁ, దానం దుండెన్. 6

క॥ తనరు నఖిలపురశాఖల
'ననుశీలనసమితి' యతని, దధిపత్యాక్ష
న్నెనరు విడి తను విడియుఁ జా
లనసేయన్‌వలయు సఖ్యూ డను నియమముతో. 7

క॥ ఆ సమితి గ్రామసంఘ
మాసక్తము, వ్యాధిపీడితాళీసేవో
ల్లాసము, సంఘీభావవి
భాసురబోధావసథము, భయనాశదమున్. 8

సీ॥ పమ్మి వేని, భటశతమ్మునకుఁ దుపాకిఁ
ద్రిప్పిపట్టుకొనుట తప్ప దయ్యె
సప్తిపై నెవ్వడు సాగ లిప్తలతోడ
కొలువంబడును మైళ్లకొలదిదవ్వ
నెక్కటిబవరాన నెవడు బాకునఁ గ్రుమ్మి
పెడబొబ్బపెట్టించె పెద్దపులిని
శ్రీవివేకానందశిష్యపరంపరా
ప్రథమపంక్తిని వేని ప్రఖ్య కలదు

గీ॥ కుడిబుజము యత డరవిందఘోషునకు, 'జ
తీంద్రనాథముఖర్జీ' మృగేంద్రనాద
మెలుగు గలవాడు మెలకువ మెలగువాడు
నెదురువాడు కొండాడెడు చదురువాడు. 9

ద్వి॥ ఆ సూరిమణియు దేశాసనారోహి
దేశవిద్రోహిబృందాసువుల్ గొన ని
శాంతఘననియమతన్మహాసమితి
క్రాంతిపత్రమున చేవ్రాల్ చేసినాడు.
"బాలకృష్ణుండు, కంటిలాలు కన్హా
యాలాలు పులినవిహారిదాసుండు
నిందుభూషణుడు, సత్యేంద్రనాథుం, డు
పేంద్రబెనర్జీ పరేశచంద్రుండు

వీరేంద్రచంద్రుడు, చారుచంద్రుడు, ఖు
దీరామబోసు, సుధీరకుమారు
డుల్లాసకరదత్తుడు, నవినాథుడు, ప్ర
ఫుల్లచాకీయు, విభూతిభూషణుడు
చంద్రదాసుడు, హేమచంద్రు, దశోక
చంద్రనందియును, శైలేంద్రనాథుండు
నింద్రదాసుండు' నిట్లే సంఖ్య మెందు
నందు దస్కతుచేసినట్టిర పిండు
యువకరక్తము విద్య యుప్పొంగఁ గలిసి
ద్రవిణ మైరమ్మద ప్రాణ మై వెలసి. 10

క॥ అది యొక రహస్యసభ య
య్యె దాని ప్రేరకులు సభ్యు లున్నతసంఖ్యన్
బొదలిరి, వాకిట నిరువురు
మెదలిరి ప్రభుపశు లచట మెలగినఁ దెలియన్. 11

గీ॥ భారతస్వతంత్రత గోరి పోరిన మృత
వీరులను, ఫాడ్కెను, చాపేకరులను
పేరుకొని మొదలైన యా తీరుసమితి
నాధిపత్యము వారీంద్రనాథు డొందె. 12

గీ॥ నలిఁ బలుకుచుండె వారీంద్రనాథఘోషు
ధృతిగుణనిషధులార! పారిషదులార!
చెఱకుఁ బిండిన బెల్లము చేయవచ్చుఁ
బ్రభుతఁ జెండిన రాజ్యముఁ బడయవచ్చు. 13

చ॥ ఇది యొక సేనగా యువకు లెందఱో యోచు ఘటించు దీనికై
మొదలిడినాము పూన్కి, నలుమూలల దేశమునందు సంఘముల్
పెదవి కదల్చినట్లు కనుపింపని యాయుధసాధనాంగముల్
పదుగురు కూడి ద్రవ్య మిడి ప్రశ్రయయోగ్యభటాళి గూర్పుడీ!

ఉ॥ సాయుధ మై ప్రజావళి జయమ్మున పట్టముగట్టుకొంట కా
లాయతిపంట, యేల్బడి వడంకగ నిప్పుడు రాజకీయహ
త్యాయతమాను లై యచట నచ్చట దుష్టుల నేయు డంచు వం
గీయులు పెక్కు రాడిరి, ధ్వనించెడి చీట్లును మాకు వచ్చెడిన్. 16

మ॥ ఇది రెం డై నది వంగ మొక్కటిగఁ జేయింపంబడఁ గోరుచు
న్నది భావంబు, విదేశ్యవస్తువుల నంటన్ బోక చట్టమ్ములన్
మది మన్నింపక యెల్లరున్ గలిసి సంభాళించుకోవచ్చు దీ
ని, దితం బౌను స్వరాజ్యయత్న మిపు డిం దేముం బ్రవేశింపగా.

గీ॥ చచ్చుదెబ్బ తిన్నదో పాము జారుకొని ప
గగొని కొట్టినవానిని కాటువేయుఁ
బ్రభుతనుఁ జంప కొకనిఁ జంప నది జాగ
రూక మై ముందె మన పూన్కి ద్రుంచివేయు. 17

మధ్యా॥ నా యన్న యరవిందఘోషు న న్నిందుఁబంపుచుఁ జెప్పె
నీ యుక్తి, లోకమాన్యుండు నిటులనె చెప్పె నాయనకు
వే యేల? భారతదేశవిప్లవసంస్థ లన్నియు ని
దే యాశయంబును మాకుఁ దెలిపె, వంగము త్రోవ మలిపె. 18

క॥ ఓ! యనుపమభారతమా
హేయీసుతవృషభులార! యికఁ జిల్లరగా,
జేయుటయో! తెలిపులితల
కాయల బేరంబు తేలగాఁదగుఁ నేడే. 19

క॥ మన మిపుడు త్రొక్కుత్రోవయె
చను నెల్లెడ నెట్టి దైన, సావర్కరు ని
ట్లని కబురంపె, నతడు త
క్కను సంస్థలు వేగ నందుకొను మన తీర్పున్ 20

క॥ సామూహికవిప్లవమున
కై మన కాయుధము లంపగా లండనులో
శ్రీమంతుడు కల, డతనికి
నీ మన మతి శ్యామజీకి నెఱిగింపవలెన్. 21

క॥ అని మెల్లగ, మృదురవనుతి
వినుచుఁ వారీంద్రు డాగె, వినిచె జలీంద్రుం
డనితరసాధోద్యమరం
జనులారా ! సజ్జనులకు సజ్జనులారా ! 22

శా॥ నావన్ గాక సముద్రమున్ గడవనౌనా! యాతతో, నాయుధ
ప్రావీణ్యమ్మునఁ గాక దాస్యమును ద్రోవన్ జాలెనా! దేశ మే
దే విశ్వమ్మున ప్రేమోతతో, సురపురిన్ దీపించునా యెప్పుడున్
జావన్ జాలక పోరున న్నరుడు యజ్ఞాదిక్రియల్ సేతతో! 23

మధ్యా॥ మనుజుడు పరిమళించు నొక మంచిగంధపుచెక యగుచుఁ
దనరి స్వాతంత్ర్యంబు, లేదో తా దానికై రణయ
ఘనవహ్నికుండంబు చొచ్చి కడలను పరిమళి పిం
మనుచుండు నీ రెండు లేవో మనుజుండు తు మె గుచు 24

మ॥ అది కాదో రణయజ్ఞకుండము, నరుం డా యై శ
క్తి దలిర్పంగఁ బరిమళించుఁ బరిపంథిత్రాత ం దొక నీన్
జదుపన్ గీర్తిమెయిన్ హుతత్వమున, దేశం బెట్లు తంత్ర్యసం
పద ప్రాపించి పరిమళించు నిదియే మంతవ్య మే ్ . 25

గీ॥ ఒక డొకని సంహరించు నెంతో శ్రమించి
సంహృతుని గుంపు వీనిని చంపు, వీని
గుంపు గుమ్మడికాయయే గొప్ప దయ్యెఁ
గడిమి యెదిరిది శస్త్రి యై క త్తిపీట 26

మ॥ ఇట్లులై యొకక్కరు నొక్కరొక్కరు ప్రజాహారమ్ములుంబోవ ను
త్కటమౌ యత్నము కీకటం బగును, శస్త్రప్రా మైఁ గూడి యొ
క్కటియే సారి జనమ్ము చెక్కవలె, ముక్కల్ లెన్ గొంట్లు, చ
క్కటి పారంబును నేర్పెబో! మన కనీకం బేబదే డ్లయ్యనున్.

క॥ చాటుగఁ గూల్తు మటన్నను
కూటపు తెలివాడు దొరకకుండు నొకండున్
బాటిలితదభృతభారతు
లాటయ మన కర్మ, దీన నౌ ఫల మేమి ? 28

శా॥ సంపాదింతును ఘోరశస్త్రచయమున్ జర్మన్ జపానోడలన్
ఝుంపన్ రా నొనరింతు ఱేని విడి యస్మద్భారతానికినిన్
వంపింతున్ దల వైరిచే, నిలువుడీ! నా తోడుగా మిత్రముల్!
నింపాదిన్ జయ మౌను, వే అనెదరో నే వత్తు మీ శ్రోవకున్. 29

క॥ భగవద్గీతాకృతిగాఁ
బొగడొందెడు జీవితమునఁ బొలుచు జతీంద్రుం
డిగఁ బలుకడ, కన్యాయలాల్
తగ దోర్చుట లంతదనుకఁ దగులుద మనియెన్. 30

గీ॥ ఒక్క యజ్ఞాతవాసము దక్క లే ద
రణ్యావాసము మనకుఁ, బో రావటిల్లు
దనుక నుండరు నినుఁ జీల్తు మనగ నేల?
మనము దుశ్శాసనుని, నొంటిఁ జనను నేను 31

ఉ॥ అందెడి వేవొ యాయుధము లందెడి, వందిన వాని నందిన
ట్లుం దొరలింత మస్త్రముమడుంగున, దుష్టుని దూరవర్తితుం
డందుమె! రూకకుం బడుగులైనను పీకకు కారు భారతం
బందు యువుల్, గతుండొకడొ ఆగతు లుందురు వేయిమంది థై

గీ॥ పారశాలయుఁ దగు ననుబంధముగను
పురి కలాశాలతో, నల్లె మెఱయుఁ జాటు
పోటు ననిజతనమ్ముతోపాటు ప్రభుత
కాంతి విఱుగఁ బ్రజయందున క్రాంతి పెరుగ. 33

గీ॥ మూడు ముక్కలలోఁ దేల్చినాడొ యిటులు
కన్యాయాలాలు సభ యిదే భాయ మనియె
తక్కు వక్తలు నీ తీరె తగిన దనగ
వారివారి యుపన్యాసధారలందు. 34

ఉ॥ అందెను సేన పాండవుల, కట్లు బొసంగదొ గీతఁ జాటుపో
టుం దగు నంచుఁ జెప్పక యుడుంగునె కృష్ణుడు సైగ రాజరా
జున్ దొడ నేయ భీమునకుఁ జూపినవాడు, దొసంగు లేదు, దు
ష్టుం దునుమాడ నన్ని సరిచొప్పులె,చెప్పె నుపేంద్రు డీమెయిన్

గీ॥ పలికె నుల్లాసకరదత్తు పయనములకు
వచ్చు నఖిలయోగములకు శస్త్రోచ్ఛ్రయమున
కెంతో ఖర్చు కాగల దిక నిందు యోధు
లొక్కడికిఁ దమ భుక్తి తా మైభరించి. 36

చ॥ తగిన ధనమ్ము కూడనెడఁ దప్పవు దోపిడు లందునందు, నీ
తగని పనిం బొనర్పఁ బరితప్తుల మేమును, కాని యేమి సే
యగలము కన్నతల్లి భరతాంబిక బావురు మంచు బాని సై
వగచుట చూచికూడ ధనవంతులు పట్టనియట్టు లున్నచో. 37

క॥ పోలీస్ స్టేషనులం బడి
పీలుంబడి శస్త్రచయము పెంచగవలసెన్
బాలకులకు మముఁ దెల్పెడి
కూళలఁ ద్రుంపంగవలసెఁ గొంకక యనుచున్, 38

ద్వి॥ దేశవిద్రోహుల ద్విశిరమ్ము లేని
దేశసింహాసనాధిష్ఠిత జాతి
శిరమేని యగు యుగాంతరపత్రిక కిక
సరివెల యనిరి తత్సంపాదకులును. 39

క॥ ఆ రేయి హేమచంద్రుని
వారింద్రుడు బాంబు సేతఁ బటుశిక్షణకై
ప్యారిసు పంపెను, సమితుల
కీ రీతిన్ బగలుఁ బొడుచు పెల్లెడ నందెన్. 40

శా॥ వామాచారులు తెల్లమేక బలిఁ దోపన్ గాళి నర్చింపగా
హోమంబుం బచరించి, రన్యులును నా డుచ్చాటనాబీజమం
త్రామంద్రధ్వనిఁ గర్జనున్ బరవిభుత్వంబుం గుటిన్ జేసి, యు
ద్దామం బైనది దేశభక్తి దసరా పద్యాలు కొంగ్రొత్తలై. 41

మం॥ ద్వి॥ దేశీయవస్త్రజాతీయవిద్యలనె
పాటింతు మని ప్రజల్ ప్రతినఁ బూనండి!
అయ్యవారికి నదే యైదు వరాలు
పిల్లవాండ్రకు పప్పుబెలాలు నదియె. 42

చ॥ ముదిరెను వెన్నెలల్ ధవళముల్ నెలమచ్చను మాపునంతగా
ఁదకము నిర్మలంబు, కుసుమోత్కరచారిమ లారబోసి పె
ట్టె దెసలఁ గాపలా ప్రకృతి, రీవి యి దంతయు భౌతికంబు, గ్ర
క్కదలెఁ బ్రజాత్మనుండి కళ, కమ్మని నవ్వులు నవ్వి రెణ్ణెలల్.

ఆ॥ వె॥ సభ యనంగ నదియె సభ, యందు వినబడెన్
బ్రిటిషుపదితలలను మించు భార
తీయుని తల తెలివిఁ దెలియుగావుత! కర్జ
నంచు గర్జ నెంచు నాద మొకటి 44

ఆ॥ వె॥ వంగమందు నేడు, పరిపూర్ణ భారత
రంగమందు రేపు, ప్రజయు తేచు
ప్రభుత దా పులిగఁ బ్రవర్తింపరా దని
యెంత త్వరగ నెఱుగ నంత మేలు. 45

గీ॥ నిన్నటనె శనివారము, నేడు భాను
వార, మెల్లుండి మంగళవార మిందు
భారతమునకు బ్రిటనుకు వార సుంత
కాలమానమ్మునఁ దెలియుగాత! ప్రభుత. 46

మ॥ ఉపవాస మ్మొనరించి వంగ మెపు డౌనో యేకరాష్ట్రమ్ముగా
నపుడే విప్పెద మంచుఁ గట్టి మనికట్లం దెట్టితో రాలు, శ్వే
తప్రభుత్వం బను బండయుం బగులు నం తౌ పట్టునుం బట్టి, దూ
రపుమేల్ దగ్గరసేయుమీకుఁ బ్రజలారా! నూఱు నేం డ్లాయువుల్

క॥ (శ్రీ) 'మోతీలాల్ ఘోషు'ని
దీ మాటల పంక్తి, యింక నెంతో వినిచె తే
దీ మధ్య సభల నీద్ప
గ్ధామాధ్యతవచన మని తద్జ్ఞులు పలుకన్. 48

గీ॥ అంతఁ బుంభావభారతి యనఁ దగిన 'స
తీశచంద్రముఖర్జి' కథించె, నమవ
సనిసియందు దీపావళి చాల వోలె
నాపదన్ ధైర్యముఖ్యగుణాళి వలయు 49

గీ॥ చీకటిని గెల్చి మర్త్యుడు చేసికొన్న
ఖౌతికమ్ము దీపావళి పండుగ యిది
భారతాత్మ చీకటిఁ గెల్చి వఱలు వఱకు
జరుగరాదు కాళీసమర్చనము దక్క. 50

చ॥ మఱదల! చిచ్చుబుడ్డి వన మాటకు మాట చిచ్చిఁద్రి బావ నాన్
వరుసలకల్మి నాడుకొనువారలు మాటలు రూపకమ్ము లై
భరతధరిత్రి కన్నిట శుభంకరు లౌదురొ వంగభంగముల్
త్వర నొకచాలె కాదు, తృటి పట్టదు చెట్టకు శృంగభంగముల్.

క॥ దీపమ్ములు ముట్టింపగ
దీపావళి పండు గైనదే? భారతల
క్ష్మీపరమసమర్చనమున
దీపావళి యై ప్రజాళి దీపింపనిచో. 52

మ॥ పడవల్గా నయి యిండ్లు,నోడలుగ నై ప్రాసాదము దోనెలై
గుడిసెల్ సాలున నొక్క రాతిరి రుచాకూపారమం దన
ర్చెడి దేశమ్మున నేకముల్ స్థితిమతుల్ చెన్నొంది ని మ్ము మ
న్గడ దీపావళి కావలెన్ దన స్వతంత్రత్వమ్ము దీపింపగా. 53

మ॥ ఒక రో జంతయు దుర్దినం బగుచు లేవో వెన్నెలల్ పున్నమై
సుక మేమీ? భరతావనీస్థితియె యీ జోకన్ దగెన్, వంగధా
త్రికి నే రాత్రిని గ్రుడ్డివెన్నెలయు లే దీ ర్చెండు తున్కల్ కదం
బక మౌదాక, ప్రభుల్ శ్రవద్భధిరు లుండన్ బశ్యదంధుల్ ప్రజల్

ద్వి॥ జనలక్ష్మి పూజలో దునుక సుమండి!
ధనలక్ష్మిపూజ యీ తరుణమునుండి
ప్రముదవద్రహితముల్ బాణసంచాలు
ప్రమిదలన్ వెల్గింత్రు ప్రమదలు చాలు. 55

గీ॥ గొప్పగాలి వీచినఁ దట్టుకొనెడి తరువు
లటులు యువకులు గాగ వ్యాయామశాల
లెన్ని యేని కావలయు నే డిందు వివిధ
శిక్షణదములు ప్రాగ్వంగసీమ నట్లు. 56

గీ॥ అనియు మరి చటర్జీ పల్కె నౌ ననంగ
వేల ప్రజ, ప్రకంపన మగ్నికీల నటులు
వాచకుల వాచనము జనవలయహృదయ
భావమును విన్న మేరఁ బ్రజ్వరిలఁజేసె. 57

చ॥ పలికె "సుబోధమల్లికుడు" పత్రిక వీధికి నొక్కమై ప్రజన్
జలమున మిక్కిలించుటకు సత్వరముఖ్య మటంచు, వాకొనెం
"బలినవిహారిదాసు" కరమున్ గరవాలము నొక్కమైన జో
దుల మొనగాడు యత్నమునఁ దూరుపువంగము చూపునేరుపున్.

శా॥ 'ఢాకా'లోని నవాబు ముస్లిములఁ దో డాచున్ గవర్నర్ ఖటా
నీకంబుం బయిగొల్పి యెవ్వనిని వందే' యన్నఁ గొట్టించి యిం
డ్లే కొల్లాడిన నుద్యతుల్ మెటికమై వెన్దీయమిన్ దెల్పి త
త్రాకీర్ణోద్యమ మిందు లే దని "మనోరంజన్‌గుహా" వాకొనెన్.

గీ॥ లోకమాన్యు కేసరితోడ మాకు మిగుల
మాల్మి, యరవిందుని భవానిమందిరమున
మా మదికిఁ గలదు గది, మ మ్మరయ రెవరు
నేత, లి ట్లొంచు మా క్రాంతి నెట్టుకొనియె 60

గీ॥ మనకు నడుమను గిర గీచి మనగల మగ
వాడు లేడు, నొక త్రుటి వేచువాడు వీడు
సంజ్ఞ వీనిది భూపేశచంద్రనాగు
ప్రభుత ప్రజత్రోవ కడ్డమురామి బాగు. 61

గీ॥ అనుచు నొక పొడుగరి పల్కె జనము సంత
సపడ, "సచ్చిదానంద ప్రసాదవసువు"
హైందవమహమ్మదీయసమైకమత్య
మస్మదీయదాస్యచ్ఛిదామత్య మనియె, 62

ఇంద్రవ॥ సంజీవనీపత్రిక సర్వవంగ
శింజానమున్ జేసె చిరోద్యమంబున్
బుంజీభవద్దీరతపొల్పుతోఁ బ
ల్కెన్ జానుగా "కృష్ణకుమారమిత్రా" 63

క॥ నరకు డనెడు 'క' ప్రత్యయ
ధరు డొక నరు డుండె, వాడు తన బలగముతోఁ
జెలసాలగ భారతమును
పరిపాలించెఁ బలునేండ్లు, ప్రజ కవి ముండ్లున్. 64

గీ॥ ఒండునింటి దీపము వెల్గి రెండుకనులఁ
జూచి యోర్వగలేడు, కచ్చుకొని నెగడు
వలెనె తన యింట దీపము వెలుగవచ్చుఁ
బగటి దివిటీలతో వాడు బయలుదేరు. 65

క॥ గీతాచార్యుడు నాయకు
డై తగప్రజచక్ర మప్పు డడచెను వానిన్
కోతుల జన మా నృతిలకుఁ
ఖ్యాతి నివాళించె సత్యభామోపేతున్. 66

గీ॥ అస్వతంత్రత్వ మనునదె యంధకార
మది నరకద త్త ముడిగిపో నంతట భర
తావనిం బండుగ యయి దీపావళి విల
సించె, వేల యేండ్లుగ ప్రపంచించె నిదియు. 67

మధ్యా॥ అలవడె పెద్దల కిందు నష్టాంగయోగ, మిహాంబు
కల యనంబడె, నిది యదనుగా నరకజ్ఞాతు లడరి
కల యైన యిలను గై కొనిరి, కై వల్య మందు డీ రనిరి
భళి! యనినారు మనవారు, బాధింపఁబడితి మీ తీరు. 68

ఆ॥ వె॥ పరమహంస చచ్చి పర మందుకొన్నాడు
బ్రతికియున్న వచ్చి పలుకకున్నె!
మనకు సాక్ష్య మిందుఁ, దనతోడ నాంగ్లుడు
చెప్పినదియుఁ దాను నొప్పినదియు. 69

గీ॥ భౌతికం బైన యిట్టి యీ పారతంత్ర్య
మందునుండి ముక్తిని పొంద నైన యోగ
మాత్తపాతంజలగురుత్వ మరసినాము
నృతిలకుండు గీతాబోద్ధ యిందుఁ బెద్ద 70

గీ॥ దేశ్యవస్తుధారణము విదేశ్యముల బ
హిష్కృతియు, విద్య జాతీయమే చదువుట
శాసననికృతి ప్రభుతకు సాయపడమి
నగు స్వరాజ్యయోగంబు పంచాంగ మిటులు 71

మ॥ ఇల స్వారాజ్యసమస్వరాజ్యమును రాదే! వేగమే యె వా
రల కీ యోగము పూర్ణ మాకలిత మై, రాణింపగా రెం తు
న్కలు నొండై మన వంగ మిందలివి యంగంబుల్ తుదిన్ రెం కా
వలెనా! యాద్రిత్రయంబు చాలు, నవియే పాటింత మీ ప్రా నన్

మధ్యా॥ కనుపింపనట్టి భూతమును కాళికామాతమంత్రమునం
గనుపించునట్టి భూతమును కడగి "వందే మాత"ర మ్మను
ఘనమంత్రమున వదల్చుకొనంగలము, కరాంగన్యాసములు
మనమున శుద్ధి వలయును మహాత్ములార! రెంటికిని. 73

క॥ బంకించంద్రుడు ఋషిగా
సంకల్పం బై కమత్యసంరంభముగా
పొంకం బగు నీ మంత్ర మ
లంకారముం జేసె రసనలకు నిపు డెవడో! 74

గేయం॥ ఓ! దుర్విధిబద్ధులార! ఓ! కుశాగ్రబుద్ధులార!
బోధించెద యోగము తత్సాధనసంపత్తితో, నొ
కే ద్రోవ నొకే రేవ నిదే చేర్చును రాజకీయ
భూధరవరశృంగమున కపూర్వవిభవరంగమునకు. 75

గీ॥ దేశభక్తి జనింపదు శ్వాసకోశ
బలముకొలది మొరసియు శౌర్యబలము లేక
కొలిమిలో నిప్పుకణిక లేకున్న తిత్తి
యెంత యూదిన జ్వాల జనింపనట్లు 76

గీ॥ రాజకీయతంత్రవ్యక్తి రకరకాల
ద్రవ్యభుక్తి యశోధికారముల రక్తి
యేదియును వద్దను విరక్తి కాదు కాదు
దేశభక్తి త్యాగంపుము త్తియముశుక్తి. 77

గీ॥ స్వార్థసన్న్యాసమున దేశభాగ్య మెసగుఁ
దోడి యుపన్యాసమున నేమి పొసగు? నెందు
వడ్లు దంచిన బియ్యము వచ్చుఁగాని
ఊక దంచిన వచ్చునే నూక లేని? 78

ఆ॥ వె॥ భరతఖండవివిధవైభవశ్రవణంబు
లేని చెవులు కొండలోని గవులు
భారతుల యనేకతారుచిరైకత్వ
మెఱుఁగని మది జలహీనము నది 79

గీ॥ పైకి గృహ మెంత మంజులం బైన లోని
దుమ్ము దులుపక యారోగ్యదమ్ము కాదు
అఖిలసుగుణాళి తోఁచి వానడుగునఁ గల
భయము పోక బ్రతుకు జయప్రదము కాదు. 80

గీ॥ వనములందు ప్రసూనసంభరితము సుమ
రస మటందు, రయ్యది సమరసమె యౌను
దానిఁ గ్రోలి సమాన మౌ స్థాయి నెల్ల
తుమ్మెదల జాతి ఝుంకృతిఁ దొడరుగాదె! 81

చ॥ ఇటు లని యెత్తెఁ జేతులను కృష్ణకుమారుఁడు, తే మంత్రమున్
స్ఫుటముగ నెత్తుబుట్టలవి భూతము లుల్కిపడం రించుచున్
రటనముతోఁ బ్రజల్ వెడలి రగ్రగవాచకు కఠోరణుల్
ఘటలగుడావాహిం బడుచు బట్టల కొట్లను మూఁ సేయుచున్ 82

ఉ॥ కొన్నియు వ్యోట్లు క్రిందబడెఁ, గొన్నియు కట్టలు లాగికోఁబడెన్
వెన్ననవేయగాఁబడియె, వేడవురా! మముఁ గొట్టఁ గాల మా
సన్నము మీ కనంబడియెఁ, జాల జనమ్ములచేత చెంప ఛె
ళ్లన్నది పాండరంబు, కవియన్ బిడిగ్రుద్దులు తిన్న దొళ్లనున్. 83

చ॥ ఒకడు పడంగ ప్రేటుదిని, యూర్చి దశాధికు లేగుదెంచి వా
ని కడక పూర్తి చేసిరి ధ్వనించి దుకాణమునుండి లేచిరా!
యిక క్రయికా! విదేశ్యముక్రయింతువొ పుట్టము, నెత్తు
నీది దే
శ్యక మనరాదు, విక్రయిక! యమ్మిన నీదియు నంతె యంచునున్

మ॥ పరధర్మంబు భయావహంబు, భగవద్వాక్యం బిదై గీతలోఁ
బరదేశ్యాంబరధారణంబు నిటులై వార్యంబు మా స్వప్రేష్టముల్
కరముల్ గా విని మీవి కాళ్లనుచుఁ, జేలు్రకాయికాళిన్ మర
ల్చిరి స్త్రీల్ స్త్రీలను పూరుషుల్ పురుషులన్ జేపెట్టుచున్
జట్టుగా. 85

సీ॥ మీ చేతి గాజులు మిలమిలలాడుచు
న్నవి, కొత్తరక మెంత! సవు రటంచు
నుంగ్రము తీయకు,డొగి ముట్టి చూచినఁ
జాలు, రా యెంత! పసం ద టంచు
చోళి బా గున్నది, చాల మందియు మని
క ట్టంటఁ దొడుగుట గంటి మనుచు
నీ షర్టుసొం పౌక యెత్తును, కప్పుగుం
డీల సొం పౌక యెత్తు, నిజ మటంచుఁ

గీ॥ జేయి పట్టి, మీ కొకమాట చెప్పవలసెఁ
జాటుగా నని కొనిపోయి సతులు సతులఁ
బుంస్తతులు పుంస్తతులఁ బ్రాతి బుద్ధిఁ జెప్పి
పంపినారలు బ్రిటనువల్వ కొననిక 86

శా॥ ఎన్నాళ్లాయెను మిమ్ముఁ జూచి, సుఖులే! యీ రందఱున్, మిత్రు లం
దున్నారల్ మనవారు, మీ రనిన నెంతో యుత్సుకుల్ రం డ టం
చున్నెమ్మిన్ గొనిపోయి కొందఱుఁ గ్రియాశూరుల్ బ్రిటన్ బట్ట ల
న్నన్నా! వ ద్దనిపించి యిండ్లకు నదూరాధ్వమ్ము పట్టించిరిన్.

క॥ బ్రిటను ద్రవ్యము భారత
పటిమ నడచె, దాని ముట్టవల దను నట్టుల్
ఘటితమహోత్సరములు ధ్వజ
పటములుగాఁ బిల్లలకును వఱలెను వేడ్కై. 88

క॥ "బ్రిటనువలువలు కొనకుడీ!
యిటను తులువతన మడంచుడీ! యిది ప్రజ లూ
రట "వందే మాతర" మను
దిటము రవముతోడ నేలదియు మిలియన్లన్. 89

గీ॥ కొట్టి కొనిపోయి తిట్టియు గొణగికొనియు
ప్రభుత గెల్చినయది లేదు, ప్రజయు నోడి
నదియు లే, దుద్యమము క్రమోన్నతము బందె
విశ్రమించి ప్రవాసపృథ్వి విహరించి. 90

క॥ తరగతి తరగతి కొక డే
మెఱుగనటులు చని యుపన్యసింప మొదటిదే
చరమము పారం బయ్యెను
కరువలియున్ దూర దయ్యె కాలేజిగదిన్. 91

గీ॥ మధురవంటి దూరపు నిగమములఁ జెన్న
నగరమందు విశాఖపట్నమ్మునందు
గుత్తిమొదలు రాయలసీమ పత్తనముల
నైనవి స్వరాజ్యసభలు వంగాంగవిభలు. 92

చ॥ పలికిరి వల్లమాలిన సభన్ బలుమంది స్వదేశదీక్షితుల్
వలువయె కాదు తాకు ప్రతివస్తువు భారతనిర్మితమ్ము కా
వలె నని "జై" నినాదమునఁ బౌరులు పల్లెలనుండి వచ్చినా
రలు మొరయంగ నుత్కరులు రాజమహేంద్రపురీవరమ్మునన్. 93

గీ॥ సమితి మొగియ మేకల మందలు, ముగియ నది
పులులు వందలు వందలు పూర్ణజనము
రవము విరిసె "వందే మాతరమ్ము" బొబ్బ
రింత ప్రభుత నెంచి కనుల నెఱుపు కొంత. 94

గీ॥ బట్టయును కుట్టుసూదియు భారతీయ
మే వలయు, కార్మణాగార మెసగవలయు
గడపగడపకు, విద్యార్థిగణము నేగి
ధనము గూర్చెను రాణ్మహేంద్రపురమందు. 95

సీ॥ నిరుపేద ముసలియు నెవడో గ్లోస్గోది క్రొం
బుట్ట మిచ్చెద నన్న ముట్ట ననియె
గెలుపు గ్యారంటీ పకీ లిడెన్ రాజీప
డెను కొంప లార్చు కోర్టని యొకండు
పరమదరిద్రుడే పరదేశప్రభుతను
కొలువ నంచు నొకండు కొలువు మానె
నిది గుమాస్తాగిరీన్ సృష్టించు ఫ్యాక్టరీ
విద్యార్థి కాలేజి విడిచె నొకడు

గీ॥ రైతొకడు శిస్తు చెల్లింపరాదు ననియె
న్యాయవాదివృత్తి విడెద ననియె నొకడు
వంగసంస్థాప్రబోధతరంగవతికి
నాద్యపృథుకుల్యా త్రవ్విన దాంధ్రజనము 96

సీ॥ చుట్ట లేనిది నాల్క చుట్టుచుట్టుకొనె న
యా! యన్న నే డమ్మ ననియె నొకడు
వ స్తుండవలసె నీవయ్య! బియ్య మ టన్న
నొకరోజు కేమి పొ మ్మి క నె నొకడు
పట్టియన్నము తిందు మెటులు కూర తే
క నc బెరుగున జాలు మనియె నొకడు
ప్రాణము మీదికి వచ్చె మం దమ్మవే
యన నేడు దాటదా! యనియె నొకడు. 97

గీ॥ నాడు తెలవడ యే దుకాణమ్ము నెవడు
నాంగ్లదమననీతిని వంగసానుభూతి
మత్స్యదేశ్యచేలాదిసంభరణమతి స
దస్సు ఖండించునాడు బందరు పురాన. 98

సీ॥ నాల్గుద్వారముల నింద్రధను వలంకృతి
దేశభక్తికి సీత తెనుగువ్రాత
మాతృస్వరూపసమ్యగ్గ్మిళచ్చిత్రిత
భారతపటపటధ్వజము కలదు
ప్రతివీధిపొడుగున ప్రజ చౌకునందు,మే
డలు మిద్దె లెక్కిరి వలనువారు
మంగళవాద్యంబు మధురగానంబు వం
దేమాతర మ్మను దివ్యగీతి

గీ॥ మొనసె సభ పతాకాభివందనము గాగ
నిందు వాగ్ధోరణులు స్వరాజ్యేందిరాక
రాగ్రకమలమధుసారణు లగ్రిమములు
బందరున తెన్గు, కల్కటాన్ వంగభాష. 99

క॥ క పత్రిక మున్నుగ
ను మ్మగ తెలుగువెలుగు నొగి వెలిగించెన్
ధృ యు కడు సహజంబుగ
విష్ణు కుడికంటి కాంధ్రపృథివి యటన్నన్. 100

క॥ మనమే యనుకోన్ మనకం
టె నొక యడుగు ముందువేసెనే!ఆంధ్రము మో
హానబలనీరంధ్రము భే
షనిరి సురేంద్రాదు లాస్థ లద్దా।యనగా. 101

ఉ॥ ఆర్యసమాజబోధముల హైదరబాదునఁ గూడ నుద్యమ
స్థైర్యము బూరటిల్లియు నిజాంపరిపాలనదుర్దినమ్ములో
నర్యమకాంతి యయ్యె,నటు లయ్యు స్వదేశపటమ్ముతేయటన్
ధార్యము లయ్యె పెకుక్కరకు తకుక్కవయయ్యు సదః ప్రసంగ
ముల్. 102

ఉ॥ బోనున బోను,పంజరకమున్ బెనుపంజరమందు నిందు సం
స్థానము, భారతోద్యమసదాగతిసేవన బంధుదర్శనా
ప్యానముతోడ మెల్చి బెజవాడకు,బొంబయినాగపూరుపూ
నానగరాలకున్ జను జనావళి హైదరబాదనుండియున్. 103

ఉ॥ ఆవిధిఁదె యైగృహాగృహమ్ముననగోష్ఠియునై ప్రజల్ "క్రియా
కేవలము ర" మ్మనిన కీలున నేరికిఁ దీసిపోని దీ
ధావహా రి,ధన్యపృథుకాళియు నెందఱో తాల్పరైరి యెం
తే వెలఁ ట్టి కొన్న పరదేశ్యపు నిస్తులరీతిదుస్తులన్. 104

సీ॥ అనవచ్చు ప్రమిద లటంచు వీనిని, కాని
యివి నిఖిలప్రజాహృదయరేఖ
అనవచ్చు తైల మటంచు దీనిని, కాని
యిది సమగ్రబలమ్ము హృదయభృతము
అనవచ్చు వత్తు లటంచు వీనిని, కాని
యివి హృత్తుజిగి వెలయించు కొసలు
అనవచ్చు దీని దీపావళి యని, కాని
యిది యెల్ల హృదయాల యేకరశ్మి

గీ॥ యిటులు వచియించి భారత మెల్లపుడు జ
యించుగావుత! మని యెలుగించి సతులు
సుతులు వెలిగించినారు దీపతతి నెందు
ప్రజల కినా డొక రసంబు పాయసంబు 105

గీ॥ కర్జ నుచ్చాటితుడు పోయె కా దనుకొని
వచ్చె లిబరలువై స్రాయి, వాని పేరు
వలలు 'మింటో', బ్రిటనునుండి వార్త తెచ్చె
వస్త్రకర్మాలయాల్ మూతవడెడి ననుచు 106

గీ॥ వఁగసంఘటనల విని పొంగె గాంధి
యిరువిధమ్ముల జతన మిత్రెలగున నయి
భారతమునందు బ్రిటనుసంబంధము నిక
కత్తిరించు కత్తెర సమాయత్త మనుచు 107

గీ॥ ఇంధనము లేని చిచ్చులై యెల్ల ప్రజకు
రేల రచ్చలు చలిని పోఁద్రోలుచున్న
వనుచు నిరువదియొకటవ యఖిలభార
తీయసభ కేగె కాశివర్తికి బెనర్జి. 108

# స్వారాజ్య ఖండము

గీ॥ బ్రహ్మబాంధవోపాధ్యాయు పత్రిక యగు
'సంధ్య' తత్కాలకృత్యపరిస్తావనమున
పేరు గొని'యుగాంతర' బలె విడిని గలిగి
వారణాసీయువకులకు పరిచితంబు. 1

గీ॥ కవి 'సరోజినీదేవి' పికస్వరమున
హిందుముస్లిమైక్యత నెలుగింపఁ దొడగె
'చిత్తరంజనదాసు' దేశీయవాది
న్యాయవాదిగ ప్రజమది నలుమఁ గడగె 2

గీ॥ కాశికిం బ్రాకినది వారి వాసి యపుడె
అగపడిన రూపు మితవాద మైన నేమి
అగపడని తత్వ మతివాద మన్న తిలక
కోవిదుని విశ్వపతి మెచ్చుకొన్నదపుడె. 3

క॥ తా దక్కు గురువు లేదై
తా దిక్కై తిలకు రాగ తను గన ఘంటా
నాదముతో విశ్వేశ్వరు
డూదించెను శంఖ మెంత యుత్సాహంబో! 4

ఆ॥వె॥ విశ్వనాథు గుడిని వినుపించు సొన్నాయి!
అపుడు జీవునితన మరిగిపోయి
బ్రహ్మతనమె నిలుచు ప్రాణిలో,నా నాద
మునకు ఆకులోని ముడుత పోవు. 5

మ॥ వలుపుం బో నరుణంబు నంత పసుపు న్నానావిధావర్ణముల్
దొలగన్ దోచెను తూర్పునన్ భువనబంధుజ్యోతి,విశ్వేశు కో
వెలలో లో నరవిందు డారసె,ప్రజల్ వేడన్ బ్రసంగించె శ్రీ
తిలకుండున్,మునివంటి గోఖ్లె గుడి కేతెంచెన్ జనెన్ వెంటనే.6

గీ॥ గోఖలేగూర్చి మీ రనుకొన్న దేమి?
యని యడుగ పాత్రికేయు డిట్లనియె తిలకు
అత డెచ్చుతగ్గులు లేని యగ్నికీల
నుడి ఫిరోజిషాదే కాని యొడద మాది

గీ॥ అంటరానితనమ్మును గెంటఁ దలచి
యతడు పోరిన పో రింతయంత గాదు
సంఘసంస్కర్త లన పడిచచ్చిపోవు
వారు సన్యాసులైన చెప్పఁ బని లేదు.

గీ॥ గోఖలే నావలెనె కాదు గొప్ప వక్త
వివరములతోడ నెదిరి నొప్పింపగలడు
పోటరితనమ్ము, ప్రజలతో పొత్తు, పట్టు
విడుపు, రాజకీయము లివి వేరు సుండి!

ఆ॥వె॥ విదితసత్య మిదియ్యు, వేరు సాధారణ
నీతి, రాజకీయనీతి వేరు
తొలి విధమున నతని మలచిన పెంపుడు
తల్లి వినతి, గరుడితల్లి వినత.

ఆ॥వె॥ అతని కెవరు శిష్యు? లల్లె మీ కెవ్వార
నంగ నతనికన్న నాలుగేండ్లు
చిన్నవాఁయైన గాంధి తన్నేతృశిష్యుఁడు
మిత్రు లుంద్రు నాకు, ఛాత్రులు నహి.

మ॥ అటులే పృచ్ఛకుడు గోఖలే పలికె నేనారంభమం దా మహో
ద్భటు నా కన్నులనిండకప్పుకొని యా పై వాని భావోష్ణ
త్కట మై తాళక దూర మైతి, నెపుడేన్ గావచ్చు తద్దోః
పటిమం బే యిట రాజకీయమున ప్రదోవన్ జూపు దీపమ్ముగా

గీ॥ ఒక మహాశక్తి లోకమాన్యు, డతని విను
పింపఁగలు సమర్థుండు వేడు లేడు
దాదభాయి జియె దక్క, మేము
వానియంత వార మెవ్వరము గాము.

గీ॥ కలవు మందాకినీతరంగముల యులివు
హర!హరా!మహాదేవ!యన్న రవ మొక్క
చోటనే, అదె కాశి, యాచోట కాంగ్రె
సుభయపక్షనేతలు కూడి రుల్లసమున. 14

గీ॥ అప్పటికి సంస్థలోన సభ్యత్వ మొప్ప
వారితతి పదివేలకు పైని యుండె
వచ్చుచున్నవి దరఖాస్తు లెచ్చుసంఖ్య
తిలకుబిపినచంద్రుల కృషి ఫలిత మగుచు. 15

క॥ నూతనవేదాంతమత
స్నాతకు డగు రామకృష్ణు ఛాత్రమణికి లో
లోతు లిడిన యరవిందుడు
కాతంత్రము లేల?"బాయికాట్" వలయు ననెన్. 16

ఆ॥వె॥ 'ఓల్డుకాన్సె' కాక యొప్పొందవలెఁ 'బాయి
కాట్సు' కూడ, నపుడె కలదు శోభ
కాంగ్రె సనగ జాతి కట్టుకొన్నట్టి గీ
మనియె నశ్వినీకుమారదత్తు. 17

క॥ లాల్ పాల్ బాల్ మేల్మే లనిరి-
అల్పములుగఁ దోపరాద ఆచరణంబుల్
జల్పము లేలా? యొకవడిఁ
గల్పింతము తావు దాని కనియెన్ గోఖ్లే. 18

ఆ॥వె॥ మును విదేశ్యవస్తువులను సర్వత్ర బ
హిష్కరింత మనుచు నిపుడు మాట
గోఖలే యనఁ దిలకు,'కపర్ది' మారలే
యనియె మెల్లగ దరహసితముఖుడు. 19

క॥ అందించినావు మాటను
క్రందేలా? రాజకీయఘనసంస్కరణా
నంద మిడెద నని 'మార్లే'
ఖందించెను గోఖలేరవము తిల కనియెఁ. 20

ఆ॥వె॥ లోకమాన్యు డౌనుగాక! దేశముకొస
మతడు చేయఁదలపట్టిన పని య
కృత్యపటలమున నహి యిటులు ననియె మా
ర్లే య టంచు గోఖలేయు పొడిచె. 21

క॥ నేయిని విషముగఁ జూచెద
వే?యైనను బుద్ధి యెంత పెరిగెన్! శూర
ధ్యేయుడు 'బాపూగోఖ్లే'
మాయురె! యనుకొనడొ! స్వర్గమందు నిను వినన్. 22

గీ॥ దుష్టశక్తి కెలగెడి దురదృష్టశక్తి
తీరుగా జుట్టుకోలేదు తేరకీర్తి
నన్ని విద్యలలోన నున్నాడు మాన్యు
డనియె తిలకు బెనర్జీయు నదిరిపోవ. 23

ఉ॥ ఎట్టు నైనగాని తరలింపమొ వామపథాన సంస్థ న
న్న ది యాస ఓపికకు నంతము లేని తిలక్మనీషిలో
కొ కలాడుచున్నది,యకుంఠితయత్నముతోడ సంస్థ చే
ప గణాంకసఖ్యు నతివాది నొనర్చుట గోఖలే హృదిన్. 24

గీ॥ పెద్దతలకాయతో నొప్పు పెంచుకొనును
గుండెకాయ, విప్లవమున కొనర డనుచు
దెలిసియున్ దిలకును సం|పదించి గాని
కదగ దరవిందు, డిది మైత్రి ఘటన మనగ. 25

క॥ దరఖాస్తులేల?అస్థులు
పరవిభుతన్గూర్చి,దాని ప్రతిఘటియింపన్
దరలుదము నిరాయుధముగ
నెటి నను నరవిందు మాట నెగ్గకపోయెన్. 26

క॥ ఎదిరించిన బెదిరించిన
నదుమంబడి మనము పొందు వాక్కులు చెడవే!
యిది నే,డది రేపు,నొకొ
కక్కదాని నొందుదము వేడుక యనెన్ 'వాఛా'. 27

